## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలుపైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలుపైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000008761

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z

Author's Last Name

A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వేదాన్త సంగ్రహము

## మొదటి పరిచ్ఛేదము

శ్లో॥ అభివాద్య హయగ్రీవపాదాంబుజమహర్నిశమ్
వేదాన్తసంగ్రహార్థం తు వివృణోమి యథామతి.

(1) 'దృక్కు', 'దృశ్యము' అనునవి రెండును వేదాంతమున ముఖ్య పదార్థములు. ఈ రెంటిని చిత్తు, అచిత్తు అనియు, జ్ఞానము, జడముననియు నామాంతరములచే వ్యవహరింతురు. దృక్కు అనగా స్వప్రకాశకమై యితరమును సర్వమును ప్రకాశింపఁజేయునది. దృశ్యమనగా తెలియఁదగిన దగుట యనిభావము, (పదార్థరూపమగు జగత్తు అని అర్థము)

(2) ఇఁకనా దృక్పదార్థము 4 విధములు:— 1. బ్రహ్మ 2. ఈశ్వరుఁడు 3. కూటస్థుఁడు 4. జీవుడు. (ఈ నాల్గు విధములగు భేదములు ఉపాధి ననుసరించి కలిగినవి గాని యదార్థమైనవి కావు. ఉపాధి యనగా స్థానమని భావము. మాయతోఁగూడిన దృక్కునకు 'బ్రహ్మ'మనియు, మాయచే నావృతమగు దృక్కున 'కీశ్వరుఁ' డనియు, అవిద్యతోఁగూడిన దృక్కునకు 'కూటస్థు' డనియు, అవిద్యావృతమగు దృక్కునకు 'జీవు' డనియు నౌపాధిక భేదముచే నామాంతరములు. అవిద్యను

'అంతఃకరణ' మనియు, 'బుద్ధి' యనియు గూడ వ్యవహరింతురు. అందుచే నిట బ్రహ్మయొక్కడే; ఈశ్వరుఁడు నట్టివాడే. ఆ బ్రహ్మేశ్వరాదుల కుపాధియగు మాయయు నొక్కటియేయై ప్రకృతి, అజ్ఞానాది నామాంతరములు గలదియయ్యెను! జీవ కూటస్థులు మాత్రము నానాత్వము గలవారు. అనగా జీవ కూటస్థులకుపాధిభూతమగు అవిద్య నానాత్వముగల దగుటయే కారణము. కొందఱు 'కూటస్థు' నొక్కనిగనే చెప్పు చుండిరి. ఈతని విషయమున నౌపాధిక భేదము ప్రయోజనము లేనిదిగదా?

(3) సచ్చిదానందమై సమస్త జగత్తున కాధారము గలది బ్రహ్మము. సర్వజ్ఞుఁడు, సర్వశక్తివంతుడు, సమస్త నియామకుఁడు, అఖిల జగత్సృష్టిస్థితి లయములకు కారణుఁడు, నిత్యముక్తుడగు వాడీశ్వరుఁడు. సచ్చిదానందమై ఆయాయి దేహముల నాధారముగ చేసికొన్న చైతన్యమును కూటస్థుఁ డందురు. కించిజ్ఞుఁడును, స్వల్పశక్తి గలవాడును, పరతంత్రుడై బద్ధుడు నైనవాడు జీవుఁడు. ఈ జీవునే కర్తయనియు, భోక్త యనియు, ప్రమాతయనియు బల్కుదురు.

(4) ఇఁక దృశ్యమనునది రెండు విధములు. 1. కార్యము 2. కారణము. ఇందు కారణమనునది మాయయను పేరుతో నొక్కటియే! ఇదియే (ఆభాసచే) తన ప్రకాశముచే నీశ్వరుని జేయునది కనుక ఈశ్వరోపాధికమయినది. ఆభాసమనగా చిత్తుయందు ప్రతిఫలించుట. ఇఁక కార్యము ద్వివిధము; 1. మూర్తము, 2. అమూర్తము, అని. ఆకారముతో గూడి

నది మూర్తము. ఆకారములేని దమూర్తము. ఇందమూర్తము 4 విధములు. 1. ఇంద్రియము 2. అంతఃకరణము 3. భూతము, 4. విషయమునని.

(5) దీనిలో 'ఇంద్రియ' మనునది మఱల రెండు విధములుగలది. 1. జ్ఞానేంద్రియము 2. కర్మేంద్రియమునని. మఱలనందు జ్ఞానేంద్రియములు 1. త్వక్కు, 2. చక్షువు 3. శ్రోత్రము 4. జిహ్వా 5. ఆఘ్రాణము, ననుభేదములచే నైదువిధములు. ఇట్లే వాక్కు, పాణి, పాద, పాయు, ఉపస్థలనెడి 5. భేదములతోఁగూడిన కర్మేంద్రియము. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ననుభేదములచే నంతఃకరణము నాల్గు విధములు.

(6) భూతములు రెండు. 1. ఆకాశము 2. వాయువు నని. విషయమనునది. 'శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను భేదములతో నైదువిధములు గలిగియుండెను.

ఇంకనిందు జ్ఞానేంద్రియమనఁగా తెలిసికొనుటకగు సాధనము అనిభావము. కర్మేంద్రియమనఁగా కర్మ లనొనరించుటకగు సాధనమని యర్థము.

శబ్దమును గ్రహించుసాధనమే శ్రోత్రము; స్పర్శను గ్రహించు సాధనము త్వక్; రూపమును గ్రహించునది చక్షువు; రసగ్రాహకమైనది జిహ్వా; వాసననుగ్రహించునది నాసికేంద్రియము. ఇట్లే మాట్లాడు పనిని జేయునదివాక్కు; 'తీసుకొనుట' యను పనిని జేయునది హస్తము, 'నడచుట' యను పనిచేయునది పాదము; మల మూత్రాదుల విసర్జన

మను పనిచేయునది పాయువు. మైథునక్రియోపకరణము లోని వ్యవహారములను చేయునది ఉపస్థ 'అంతఃకరణము' ఆ అంతః కరణమే సంశయవృత్తితో నుండెనేని 'మనస్సు' అందురు. నిశ్చయ వృత్తిగల అంతఃకరణమునకు 'బుద్ధి' అనుపేరు. స్మరణ రూపమైనది చిత్తము. గర్వాత్మకమైన దహంకారము.

(7) ఆకాశము శబ్దగుణముగలది శబ్దస్పర్శ గుణములు గలది వాయువు; శబ్దగుణమును గ్రహించునది శ్రోత్రము. అందుచే శ్రోత్రము శబ్దగుణకము. త్వక్కుచే గ్రహింపఁదగిన గుణము స్పర్శము: నేత్రేంద్రియ గ్రాహ్యమగు గుణము రూపము; నాలుకచే గ్రహింపఁదగిన గుణము రసము; నాసికచే గ్రహింపఁదగిన గుణము గంధము.

(8) భూతము, భౌతికము నని మూర్తము ద్వివిధము. పృథివి, అప్పు, తేజస్సులను భేదములచే భూతములు మూడు విధములు. శబ్ద,స్పర్శ, రూపములను గుణములుగలది తేజస్సు; శబ్ద, స్పర్శ, రూప, రసగుణములుగలది ఉదకము; శబ్ద, స్పర్శ, రూప, రస, గంధగుణములుగలది పృథివి. పైఁ జెప్పఁబడిన ఆకాశ, వాయువులతోఁగూడి యీ పృథివ్యప్తేజస్సులు మూఁడును పంచభూతములుగ వ్యవహరింపఁబడినవి. ఈ పంచ భూతములకు ప్రత్యేకముగ ముఖ్యగుణములు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. అనగా ఆకాశమునకు సహజ స్వాభావిక ముఖ్యగుణము శబ్దము; పృథివికి ముఖ్యగుణము గంధము. పృథివియందు మిగిలిన శబ్ద, స్పర్శ, రూప, రసములనెడివి కార్యకారణ భావముచే లబ్ధములయినవి. అందుచేతనే 'ఆత్మన

ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ' అని సృష్టిక్రమమును వేదము బోధించినది. ఆకాశ ముఖ్యగుణమగు శబ్దము వాయువునందును వాయ్వాకాశముల గుణములగు శబ్ద స్పర్శలు తేజస్సు నందునను, శబ్ద, స్పర్శ, రూపములు అప్పునందునను, శబ్ద, స్పర్శ, రూప, రసములు పృథివియందునను సంక్రాంతములైనవి. ఇందులకు కార్యకారణ భావము హేతువు.

(9) ఈ పంచభూతములును పంచీకృతములని, అపంచీకృతములనియు ద్వివిధములు. ఇందు అపంచీకృత భూతములైదును అంతః కరణాది సృష్టికి కారణములు. భూతసృష్టి కంతటికి కారణములై ప్రకృతముపలభ్యమానములు పంచీకృత భూతములు. భూతములనుండి పుట్టిన సర్గమునకే భౌతిక సర్గమని పేరు. ఆ భౌతికములు సచేతములని అచేతములని రెండు విధములు. వీనినే ప్రాణముగలవనియు, ప్రాణము లేవనియుగూడ నందురు. అనగా ప్రాణులు సచేతనములని, అప్రాణులచేతనములని భావము.

(10) ఆ సచేతనములు స్థావర జంగమము లనెడి భేదముచే రెండు విధములు. గమనము (చలనము) లేనివి స్థావరములు (వృక్షములు మొదలగునవి) ఇందు జంగమములు మూఁడు విధములు. 1. స్థలీయము, 2. జలీయము, 3. నాభసమని. అనఁగా స్థలమున (మిట్టనేలపై) చరించునవి స్థలీయములు; (మనుజులు మొదలగుఁనవి) జలమున సంచరించునవి

జలీయములు. (చేపలు మొదలగునవి) ఆకసమున దిరుగునవి నాభసములు. (దేవతలు, పక్షులు మొదలగునవి)

(11) ఈ సచేతన భౌతికములను స్థూలశరీరములందురు. ఈ శరీరమాత్మకు భోగస్థానము. శరీరమనగా '1. అస్తి = ఉన్నది; 2. జాయతే = పుట్టుచున్నది; 3. వర్ధతే = వృద్ధిఁ బొందుచున్నది; 4. విపరిణమతే = మార్పుదలగలది; (బాల్యయవ్వన వృద్ధాప్యములచే) 5. క్షీయతే = క్షీణించుచున్నది; 6. నశ్యతి = నశించుచున్నది; అనెడి యారువిధములగు వికారములు గలది. మూర్తామూర్తరూపమగు నీ సమష్టి కార్యప్రపంచమంతయు 'విరాట్టు' అని చెప్పఁబడుచున్నది. ఇంతవఱకు దృశ్యశబ్దార్థము విపులముగ వర్ణింపఁబడినది. (అనఁగా శరీరలక్షణమిందు వర్ణితము)

(ఒకటవ పరిచ్ఛేదము సంపూర్ణము.)

# రెండవ పరిచ్ఛేదము

(1) దృశ్యమగు జగత్తు రెండువిధములు. 1. సమష్టి, రెండువ్యష్టిఅని. అదిమఱలస్థూల,సూక్ష్మ, కారణములనెడి భేదముచేత్రివిధము. అందు 1.స్థూలసమష్టిజగత్తువిరాట్టు 2.సూక్ష్మ సమష్టిజగత్తు లింగము (సూక్ష్మము) 3. కారణసమష్టిజగత్తు అజ్ఞానము. అట్లే 4. స్థూలవ్యష్టిజగత్తు మనుష్యశరీరాదికము. 5. సూక్ష్మ వ్యష్టి జగత్తు లింగము. 6. కారణ వ్యష్టి జగత్తు అజ్ఞానము. అని వివరణము.

(2) ఇఁక దృక్కు అని చెప్పఁబడు జీవేశ్వరులిద్దఱు ప్రత్యేకముగ నొక్కొకరు మూఁడు విధములు గలవారు. "అందు జీవుఁడు" విశ్వుఁడు, తైజసుఁడు, ప్రాజ్ఞుఁడు నను పేర్లు గలవాఁడు. ఈశ్వరుఁడు 1. వైశ్వానరుఁడు 2. హిరణ్యగర్భుఁడు మాయావీ అను పేరులుగలవాడు. ఇందున స్థూలవ్యష్టి దృశ్య మనుష్యాది శరీరాభిమానియగు జీవుడు విశ్వుఁడు. 2. సూక్ష్మ వ్యష్టి దృశ్య లింగ శరీరాభిమానియగు జీవుడు తైజసుడు 3. కారణ వ్యష్టిదృశ్యా జ్ఞానాభిమానియగు జీవుడు ప్రాజ్ఞుఁడు. ఇట్లే 4. స్థూలసమష్టి దృశ్యవిరాడభిమానియగు నీశ్వరుఁడు వైశ్వానరుఁడు. 5. సూక్ష్మసమష్టిదృశ్య లింగాభిమానియగు నీశ్వరుఁడు హిరణ్యగర్భుఁడు. 6. కారణసమష్టిదృశ్య అజ్ఞానాభిమానియగు నీశ్వరుఁడు మాయావి." అని జీవేశ్వర విభాగము దృశ్యమునఁ జూపఁబడినది. స్థూలకారణ శరీరములు రెండు నిదివరలో వక్కాణింపఁబడినవి; ఇఁక లింగశరీరమునుగూర్చి చెప్పఁబడుచున్నది.

(3) లింగమనఁగా జ్ఞానేంద్రియములైదు; కర్మేంద్రియములైదు; సూక్ష్మభూతములైదు; మనస్సు, వీనిని పదునాఱింటిని కలిపిన సమూహము. సూక్ష్మ భూతములనగా అపంచీకృతములగు పంచభూతములు.

ఈపైఁ జెప్పఁబడినదే సూక్ష్మశరీరము. దీనితో 2వ పేరాలో చర్చింపబడిన స్థూల, కారణ శరీరములును కలిసి శరీరత్రియము అని చెప్పబడుచున్నవి. ఇందే కోశపంచకమును చెప్పుచున్నారు.

(4) అదెట్లన 1. అన్నమయ, 2. ప్రాణమయ, 3, మనోమయ, 4. విజ్ఞానమయ, 5. ఆనందమయము లనెడివి పంచకోశములు. ఖడ్గముంచుటకుఁ దగిన వరయెట్టిదో అట్లే ఆత్మస్వరూపమునకు అపవరక మివి యగుటచే నీపై యైదింటికిని కోశములను వ్యవహారము కలిగెను.

ఇవి వ్యవహరింపఁదగిన చోటులు:- అన్నమయకోశము. మనుష్యాది స్థూలశరీరము. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు సూక్ష్మశరీరము. ఆనన్దమయ కోశము కారణశరీరము.

(5) 'నేను' అని వ్యవహరించు నంతః కరణవృత్తికి విజ్ఞానమనియు, "ఇది" యని వ్యాహరించు నంతః కరణవృత్తికి 'మనస్సు' అనియు శాస్త్రజ్ఞుల నిర్ణయము. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములనెడి వాయుపంచకము ప్రాణమయకోశము. ఈ పంచవాయువులు నొక్క ప్రాణవాయు భేదములే. ఐన చోనాయాయిస్థానములందుండి మనుజునుజ్జీవింప జేయునవి; కాన ప్రాణవాయువే పంచధా విభక్తమైనది. అది వాయురూపము గలదియే.

(6) ఈ జీవునకు జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తియను మూడవస్థలుగలవు. ఇందు జీవుడెప్పుడు విశ్వుడను పేరుతో నింద్రియములచే బాహ్యార్థముల గ్రహించుచుండునో అప్పుడు జాగ్రత్తు అనవలెను. జీవుడెప్పుడు తైజసుఁడను పేరుతో లోనియవిద్యా వశమగుచుండునో దానిని స్వప్నమనవలెను. జీవు

డెప్పుడు ప్రాజ్ఞుఁడను పేరుతో నవిద్యావృత్తిచే నజ్ఞాన సుఖమునందుచుండునో దానినే సుషుప్తి యనవలెను.

ఈయవస్థాత్రయము, శరీరత్రియము, జీవత్రయమునను త్రికము కూటస్థునియందు మాయచే గల్పింపబడినది. కావున కూటస్థుఁడు వ్యష్టిప్రపంచమున కధిష్ఠానమనఁదగినవాఁడు. ఇట్లు గాశరీరి వర్ణింపఁబడెను.

( రెండవ పరిచ్ఛేదము సంపూర్ణము. )

# మూఁడవ పరిచ్ఛేదము

(1) దృక్పదార్థమగు చైతన్యము మఱల నాల్గు విధములు. 1. ప్రమాత, 2. ప్రమాణము, 3. ప్రమేయము 4. ప్రమితి అనుభేధములు. 'నేను చేయుచున్నాను' అనుదానిలోని 'నేను' అనునది క్రియాశూన్యమైనదైనను అంతఃకరణతాదాత్మ్యముచే 'చేయుట'లోనికి కర్తగాఁ దీసికొనఁబడినదే 'ప్రమాత' యనుపించుకొనును. ఒక ఘటమును జూచునప్పుడు చూపరి అంతఃకరణచైతన్యమున ప్రతిఫలితమగు ఘటవృత్తి ప్రమాణ మనుపించుకొనును. కేవల ఘటముపై చైతన్యము గూడినక్షణమందు ఆఘటగత చైతన్యము ప్రమేయము. 'ఇది ఘటము' అని అంతఃకరణవృత్తితో నాత్మసంయోగమునకు ప్రమితిజ్ఞానమందురు. జ్ఞానమనగా చైతన్యమునకన్న విభిన్నమైనదిగానిది. అధ్యాసయనఁగా పూర్వకాలమునఁజూచినదానిను త్తరకాలమునచూచిన వస్త్వంతరముపై స్మృతిగలుగుట.

అదిగానిదానియందా బుద్ధిగలుగుట. దీనిని తార్కికులు అయథార్థానుభవము అని చెప్పుచున్నారు.

(2) ఈయధ్యాస అర్థవిషయికముగను, జ్ఞానవిషయికముగను రెండు విధములు. అర్థాధ్యాసయనగా దోషముతో గూడిన సంస్కారముచే వెండిగాకున్నను శుక్తియందు వెండియను బుద్ధిపోడముట. జ్ఞానాధ్యాసయనగా దోషసంస్కారముచే రజ్జువునందొక బుద్ధినిగల్పించి దానిని సర్పమని భ్రమయుట. ఈపైఁజెప్పఁబడిన వానిలో అర్థాధ్యాసమనునది మఱల రెండువిధములు. 1. ప్రాతిభాసికము, 2. వ్యావహారికము. ఇందు ప్రాతిభాసికమనగా చూచుసమయమునమాత్రి ముండి యుండునది. ఉదాహరణము రజ్జువునెడ సర్పభ్రాంతి, స్వప్నమున గజమువంటిది. వ్యావహారికమనగా వ్యవహారకాలమున మాత్రిముండునది. ఘటాదివిషయ ప్రపంచమంతయు వ్యావహారికాధ్యాసయే. మరలనది కార్యాధ్యాసయనియు కారణాధ్యాసయనియు, ద్వివిధము. కారణాధ్యాసయన మాయ, కార్యాధ్యాసయనగా దేహేంద్రియాదులు.

(3) ఇట్లు చెప్పినచో వ్యావహారికత్వము జగత్తునకంతటికిఁ గలదుగదా? సర్వము అధ్యాసరూపమయినదేనని ఘటాదిజ్ఞానమే(ప్రమితి) లేకుండవలసి వచ్చును. అట్లుగాదు. ప్రత్యక్షమైన వస్తువు వ్యావహారిక కాలమున బాధితముగాదు కదా? (అనఁగా రజ్జువునందున్న సర్పభ్రాంతి గురూపదేశాదులచే బాధింపబడినట్లు) అందుచే వ్యవహారకాలమున గల

ఘటాదులు వ్యవహారకాల పర్యంతము సత్యములేగదా ? (అధ్యాసములనుపింపవు).

(4) ఇఁక అంతఃకరణవృత్తి రెండు విధములు. 1. ఘటాదివిషయరూపము. 2. ఘటాదిజ్ఞానరూపము. ఇందు ఘటాదిజ్ఞానాకారవృత్తినే ప్రమితియని నిరూపించితిమి. విషయాకారవృత్తి, చైతన్యమునఁ బ్రతిఫలనముగలదై జ్ఞానాకారవృత్తికి సాధనమగుటచే (వృత్తియందు ప్రతిఫలించిన చైతన్యమే) ప్రమాణమగుచున్నది అనగా 'ఇదిఘటము' అను యథార్థానుభవసాధనమే ప్రమాణము. దీనినే తార్కికులు ప్రమితియని యథార్థానుభవమని వాడిరి.

(5) ఆ ప్రమితి వ్యావహారికమని, పారమార్థికమని, రెండువిధములు. ఇందు వ్యవహారకాలమున మాత్రము సత్యమై యున్న ఘటాదిజ్ఞానమునకు వ్యావహారిక ప్రమితియను పేరు. 'ఇదిఘటము' అను ప్రత్యక్ష ప్రమవ్యావహారికము. పరమార్థముగ నిత్యమగు పరమాత్మ తత్త్వజ్ఞానమునకు పారమార్థిక ప్రమితి యను పేరు. అదెట్లనగా ? "ఈ యాత్మయే బ్రహ్మస్వరూపము" ఇట్టిజ్ఞానమునే పారమార్థిక ప్రమితి యని బ్రహ్మవిద్య యని యందురు. ఏ విద్యబుట్టినమాత్రముచే అవిద్యామూలకమగు అధ్యాసతొలఁగిపోవునో దానినే విద్యయందురు. అనగా జ్ఞానమని యర్థము. ఈవిద్యారూపమగు జ్ఞాన ప్రాదుర్భావమునకు సాధనము 'తత్త్వమస్యాది, మహావాక్యార్థ విచారరూప అంతఃకరణవృత్తి ప్రబోధము. బ్రహ్మాత్మైక్యజ్ఞాన మెప్పుడును సజాతీయ విజాతీయ ప్రతి

బన్ధకరహితమైన మహావాక్యార్థ విచారముననే గలుగు నట్టిది గదా? అందుచేతనే ఆత్మతత్త్వబోధకు మహావాక్య (తత్త్వమస్యాది) విచారణ మవసరము. కావుననే వ్యాస సూత్రములలో 'శాస్త్రయోనిత్వాత్' అనియు, వేదములలో 'ఔపనిషదం పురుషం' అనియు గలవు.

(6) ఆ ప్రమాణములు, 1 ప్రత్యక్షము, 2 అను మానము, 3 ఉపమానము 4 శాబ్దము, 5 అర్థాపత్తి 6 అను పలబ్ధి అను భేదముచే నాఱువిధములు. వరుసగా వీని లక్షణము లట్లు 1 చక్షురాదింద్రియములచే వస్తువు 'నిది' యని యదార్థ ముగ తెలుపు సాధనమగు ప్రమాణము. ప్రత్యక్షముమనస్సు, నేత్రము, మొదలగునవి. 2 ఊహించుటకు దగిన సంబంధ ముతో నూహించు సాధనము అనుమానము. 3 సాదృ శ్యము సాధనముగ గలది ఉపమానము. దానినే సాదృశ్య జ్ఞానమనియుఁ బల్కుదురు.

4 శబ్దములచే గ్రహింపవీలగు సాధనమైన ఆప్త వాక్యము; శాబ్దము. ఈ ప్రమాణమునకు సాధనములు నాల్గు 1 ఆకాంక్ష, 2 యోగ్యత 3 ఆసత్తి 4 తాత్పర్యము. వీని నాధారముగఁ జేసికొని శబ్దప్రమాణమును జెప్పవలసినదే గాని యెవరి యిష్టప్రకారము వారర్థమును చెప్పుటకు వలను పడదు. 5 ఇదివరలో నొకదానిని జెప్పి పరిశేషన్యాయముగ లేదా కైముతిక న్యాయముగ జెప్పదలచుకొన్న దానిని జెప్పుట అర్థాపత్తి. ప్రత్యక్షముగ లేని వస్తువుయొక్క అభావ మును దెలియఁ జేయు సాధనమున నుపలబ్ధిప్రమాణమందురు.

(7) ఇఁకనిందు బ్రహ్మపదార్థము విషయరూపముగ (ఘటాదులవలె) నుండదుగాన ప్రత్యక్ష ప్రమాణగోచరము గాదు; రెండవవస్తువులేని యద్వితీయ మగుట ననుమానప్రమాణ గోచరముగాదు. సంపూర్ణమగుటచే సాదృశ్యాభావ మగుట వలన నుపమానార్థాపత్తి ప్రమాణ గోచరముగాదు. నిత్యముగ నుండుటచే అనుపలబ్ధి ప్రమాణ గోచరముకాదు. కాగాశబ్దప్రమాణముచేత నేగోచరమగునది. ఆ శబ్దములుగూడ లౌకికములనియు వైదికములనియు రెండు విధములు. ఇందు లౌకికశబ్దములచే బ్రహ్మపదార్థ నిరూపణము చేయఁదగనిది గావున నా లౌకిక శబ్దప్రమాణమునకు వేదాంతమునఁ బ్రవేశ ము లేదు. ఇక వైదికశబ్దములకే. అవియు విధిపరములనియు, నిషేధపరములనియు, బ్రహ్మపరములనియు, మూఁడువిధ ములు. పూర్వకాండలో (ప్రవృత్తిమార్గములో) వినియోగ పడు విధినిషేధవాక్యములక్రిందఁ ప్రవేశము లేదు. కాగా మిగి లిన వేదాన్త వాక్యములకు (బ్రహ్మపరములకు) మాత్రమే యిట యుపయోగము. ఆ వేదాన్త వాక్యములుగూడ నిర్గుణ పరమానంద స్వరూప పరమాత్మను బ్రత్యక్షముగ దెలుప నశక్తములై ఆరోపాపవాదములచే కొన్నియు, లక్షణా వృత్తిచేఁ గొన్నియు సూచించును. ఆరోపమనబ్రహ్మయందు జగత్తునారోపించుట. ఇదికాదు అనియపవాదముచేబ్రహ్మను తెలుపుట కుపయోగపడున దపవాదము. ఇది ప్రమాణములను నిరూపించు నదగు మూడవ పరిచ్ఛేదము.

( మూఁడవ పరిచ్ఛేదము సంపూర్ణము. )

# నాల్గవ పరిచ్ఛేదము

(1) ఇందు బ్రహ్మయందు జగత్తు నారోపించి దాని నపవాదముచేసి బ్రహ్మను తెలియజేయు పద్దతి. దానిని అధ్యారోపాపవాదన న్యాయమందురు. అందులకుగాను సృష్టి క్రమము సంక్షేపముగఁ జెప్పబడుచున్నది.

(2) జీవునకు ముఖ్యముగ వ్యవహార దశయనియు, పారమార్థికదశయనియు రెండుగలవు. అందు పరమార్థదశ యందు బ్రహ్మకన్న వ్యతిరిక్తమైన దేదియులేదు. సుషుప్తి మృతి, మూర్ఛాదులన్నియు నిందంతర్భూతములేగద? ఇఁక వ్యవహార దశయందంతయు నున్నదే జాగ్రత్స్వప్నదశలు దీని యందే చేరును. ఈ వ్యవహార దశయందు బ్రహ్మజగత్సృష్టి స్థితి లయములకు హేతువనుటయే బ్రహ్మకు తటస్థ లక్షణము సచ్చిదానందరూపమై మాయ కాశ్రయమైయుండుట స్వరూప లక్షణము.

(3) సృష్టికి పూర్వమున మాయకాశ్రియమైనబ్రహ్మ మొక్కటియే యుండెను. ఆమాయయు బ్రహ్మయందుగల్పిం పబడినదే. కనుక మాయ వ్యావహారికము. వ్యవహారమెప్పు డు నధ్యాసకార్యమే! అట్లైనచో నీమాయ ఎవనిచే నెప్పుడ ధ్యస్తమైనదనుశంక చేయగూఁడదు .ఈ మాయాధ్యాస అనాది యు న నిర్వాచనీయము. ఇది స్వాయముగనైనది. బ్రహ్మ మాయాశబలితము అనుటకు హేతువేమన? జగత్సృష్ట్యాది వ్యాపారము మాయలేనిదే కుదరదుగాన బ్రహ్మముమాయా

శబలితమన వలసి వచ్చినది. ఇది శ్రుత్యాదిసమ్మతము. అనాదినుండి జగత్సృష్టి హేతువై అనిర్వాచనీయమైన దేదియో? అదియే మాయాస్వరూపము అనిర్వాచనీయ మనగాఁ జెప్పనలవిగానిది. అది సత్పదముచేగాని, అసత్పదముచేగాని చెప్పుటకు వీలులేనిది. మాయఅసలులేనిది; జ్ఞానముచే తొలఁగిపోవుచున్నదిగద. గోచరించుచున్నది గావున ఉన్నదనవలెను. ఉండిలేకుండుట అనుట యొకేదానికిఁ దగదు గావున సదసత్తు అనియు ననరాదు. అందుచే నీ మాయ యిట్టిదని చెప్ప నలవిగానిదగుటచేతనే అనిర్వాచనీయము అని చెప్పఁదగినదని భావము. ఈ మాయ యెట్టిదో యెవ్వరు నెఱుగనిది గావున మిథ్యయనియే పల్కిరి. 'అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం' అను మొదలగు శ్రుతులను జగత్సృష్టి హేతువనిమాత్రము సర్వులంగీకరించిరి.

(4) ఇఁక నిందు విషయములో ద్వైతులు మాయను సత్యమనియు నీశ్వరశక్తియనియు నంగీకరించిరి. దీనినే అద్వైతులు మిథ్యయనిరి. ఇదియే ద్వైతాఽద్వైతులలోఁగల భేదము. ద్వైతులంగీకరించిన మాయ ఈశ్వరశక్తియనునంతవఱకు అద్వైతులుగూడ నంగీకరించిరి. అందువలననే నిరవకాశమగు బ్రహ్మనుండి మాయాశబలగుణముచే నాకాశము పుట్టినది. మాయాశబల బ్రహ్మకాక కేవల బ్రహ్మమునుండి ఆకసము పుట్టినదనుటకు వీలులేదుగదా?(బ్రహ్మ నిరవకాశము)మాయ యీశ్వరశక్తియనుట ద్వైతవాదిమత మంగీకారము. రజ్జువు నందు సర్పమట్టులు మాయాదోషముచే బ్రహ్మయందాకా

శము నుదయింప నీలయ్యెను. ఈ పుట్టిన యాకాశమందు మాయాగుణములగు అనృత, జడ, దుఃఖములు బ్రిహ్మగుణములగు సత్య, జ్ఞాన, ఆనందములు కలిసి యారుగుణములు గలవు. ఇట్లే వాయువు మొదలగునవన్నియు కారణగుణకములగు కార్యములు. అందుచేతనే (కార్యకరణో భయగుణములగుటచే) ఆవకాశమున్నది. ఆకాశము ప్రికాశించుచున్నది. ఆకాశము ప్రియమైనది, ఆకాశము లేనిది, ఆకాశము జడమైనది. ఆకాశమప్రియమైనదని యీ యారువిధములుగ సర్వుల కనుభవమందున్నది. ఆకాశమునకు సహజగుణము ప్రితిధ్వని. మాయాశబలిత బ్రిహ్మయందధ్యస్తమైన ఆయాకాశమునుండి పుట్టినవాయువునందు స్వీయగుణముతో గూడ నెనిమిది గుణములుండును. అట్లేవాయువునం దధ్యస్తమగు నగ్నియందు గుణనవకమును, తదధ్యస్తజలమున దశగుణములును, తదధ్యస్తపృథివియందేకాదశ గుణములు గలిగి యున్నవి. ఈపంచభూతముల నపంచీకృత భూతములనవలెను.

(5) ఈ పంచభూతములకుపాదానకారణము మాయయగుటచే మాయయందున్న సత్త్వ, రజ, స్తమోగుణములు మూడును ఈభూతములందున్నవి. అందు ఆకాశమందున్న సత్వగుణముచే, శ్రోత్రిము, ఇంద్రియ సమూహము పుట్టినది. వాయువునందలి సత్వగుణముచే చర్మముత్పత్తియైనది. అగ్నియందలి సత్వగుణముచే నేత్రముత్పత్తియైనది; జలమందలి సత్వగుణముచే జిహ్వేంద్రియముద్భూతమైనది. పృథివి

యందలి సత్వగుణముచే నాసికేంద్రియము సంభూతమయినది. ఆకాశమందలి రజోగుణముచే వాక్కుబుట్టినది. వాయురజోంశచే హస్తములు, అగ్నిరజోంశచే పాదములు, జలరజోంశచే గుహ్యేంద్రియములు, పృథివీ రజోంశముచే మలవిసర్జనేంద్రియములును బుట్టినవి. ఈపై జెప్పబడిన జ్ఞానకర్మేంద్రియ దశకమును ఆకాశాది పంచభూతములయొక్క వ్యష్టిరూప సత్వరజోంశలచే నుత్పత్తియైనది. పంచభూతముల సమష్టి సత్వగుణముచే నంతఃకరణ ముద్భవించినది. పంచభూతముల సమష్టి రజోగుణముచే ప్రాణముదయించినది. ఈపై యంతఃకరణమున సుఖము, దుఃఖము, కామము, సంకల్పము, సంశయము, శ్రద్ధ, అశ్రద్ధ, హ్రీ, ధీ, భీ అను మొదలయినవి గలవు. ప్రాణమందున్న ధర్మములు ఆకలి, దప్పి, మొదలగునవి.

(6) ఇంక నీభూతములైదును ఈశ్వరేచ్ఛచే పంచీకృతములయ్యెను. అదెట్లన? పంచభూతములును ప్రత్యేకముగ రెండుభాగములుగ జేయఁబడెను. అనగా ఆకాశములలో 2 భాగములున్నవనుకొనుడు. అందు రెండవభాగము మఱల నాల్గువిధములుగాబడినది. ఇట్లే ప్రతిభూతమునకు దమ రెండవ భాగమునాల్గువిధములుగగాబడినది. ప్రతిభూతములోని మొదటి భాగమునటుంచి రెండవభాగములోని నాల్గుభాగములను నాల్గు భూతములతోఁ జేర్పబడినవి. దానినీ క్రిందివిధముగా జూడనగును. ఆకాశములోని మొదటిదగు పెద్దభాగముతో వాయ్వాదులలోని రెండవభాగమునగల నాల్గుభాగములు ప్రత్యేక

ముగగలిసెనేని దానినాకాశము పంచీకృతమైనదనుట. వాయువులోని మొదటి సగభాగముతో నాకాశాదులలోని రెండవదానియందుగల నాల్గుభాగములు ప్రత్యేకముగ గలసిన దానిని పంచీకృత వాయువందురు. ఇట్లే అగ్నిలోని సగభాగముతో నాకాశములోని రెండవభాగమునగలయొక ఆకాశాంశము వాయువులోని సగములో నాల్గుగ విభక్తమైనదానిలోనియొక వాయుభాగమును చేరినదానిని పంచీకృతాగ్నియందురు. ఇట్లే పృథ్వీజలములుగూడ. ఈవిధముగ భూతపంచీకరణము చేయబడెను.

(7) పంచీకృతములగు నీపంచభూతములనుండి సమస్తమగు మనుష్యాదిశరీర సముదాయముత్పన్నమైనదని పూర్వమే చెప్పఁబడినది గదా ? మడుగున సూర్యుఁడువలె నంతఃకరణమున ప్రతిబింబరూపుడు జీవుడును, బింబరూపము బ్రహ్మమనియు గుర్తెరుంగుదురుగాక. ఆజీవునకు బింబరూపు డీశ్వరుఁడనియు గొందఱు పల్కుదురు. కొందఱు మాయయందు ప్రతిఫలించిన బ్రహ్మము నీశ్వరుడందురు. ఈశ్వరుఁడు, జీవుఁడు, మనస్సు, అజ్ఞానము, ప్రాణము జ్ఞానేంద్రియములైదును, కర్మేంద్రియములైదును, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడి విషయపంచకమును, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి అను పంచభూతములునుగలసి 25 తత్త్వములు ఈ 25 తత్త్వములును, అంతఃకరణములోని భేదములు మూఁడును, ప్రాణపంచకములోని మిగిలిన నాల్గునుగలసి 32 తత్త్వములనియందురు. ఇవి వ్యావహారికకాలమున సత్యములుగాన

వీనిని తత్త్వములందురు. భౌతికములన్నియు భూతమయములే యగుట వేఱుగా పరిగణింప నవసరము లేదు. ఇది యధ్యారోప మను నాల్గవపరిచ్ఛేదము.

( నాల్గవ పరిచ్ఛేదము సంపూర్ణము. )

# ఐదవ పరిచ్ఛేదము.

(1) ఈ పైఁజూపబడిన క్రమమును విపర్యయముగ లయమును చెప్పుటయే అపవాదమందురు. అదెట్లనగా? లోకములో కార్యరూపమగుఘటము కారణరూపమగు మృత్తులో లయమగునట్లు పంచభూతములచే నుద్భవించిన భౌతిక సృష్టి యంతయు నాభూతములలోనే లయమగును. కారణమునకన్న వేఱుగ కార్యమనునదియే లేదు. కుండ మట్టికన్న వ్యతిరిక్త మైనదెట్లుగాదో, దారములకన్న వ్యతిరేకముగ వస్త్రమెట్లు లేదో, అట్లే భౌతికజాతమంతయు పంచభూతములకన్న వ్యతిరేకముగాదు.

(2) ఇట్లే పంచీకృతభూతములుగూడ నా అపంచీకృత భూతములలో లయమగును. ఆ అపంచీకృత భూతములుగూడ తుదకు భూమి, జలములందును, జలమగ్నియందును, అగ్ని వాయువునందును. వాయువాకాశమునను, ఆకాశము మాయ యందునను లయమగును.ఇట్లాకాశాది భౌతికసృష్టి పర్యంతము లయముకాగా మాయయనునదిగూడ స్వయముగ నదృశ్య మగును. ఈ ప్రపంచమంతయు ఆమాయాకల్పితమని దీనివలన

తలచుచుంటిమిగాన నీప్రపంచమే యదర్శనమగునపుడా మాయ యెట్లుండును? కావున నదియు నాశనమగును. అదెట్లన? సమిధలున్న పర్యంతమున్న అగ్ని సమిధలు లేనపుడెట్లు స్వయముగ నశించుచున్నదో అట్లే ప్రపంచమున్నంతకాల మూహింపదగిన మాయ ప్రపంచలయమునఁ దానునులయమగును. ఇందులకు

శ్లో॥ నిస్తత్వాకార్యగమ్యాస్య శక్తిర్మాయాగ్ని శక్తివత్ ॥

ఇత్యాదులనేకములు విద్యారణ్యులవారు చెప్పియేయుండిరి. ఇదిగాక మరియొకపద్ధతి :- మాయనుగూడ బ్రహ్మయందు లయముగలదనియనిరి. బ్రహ్మయొక్క సత్తయే మాయయొక్క సత్తయు. అందుచే బ్రహ్మమునకంటె మాయ వేరుగాలేదని తలచుటయే మాయలయమగుట. ఇట్లే 'నేను బ్రహ్మనుగాను, 'బ్రహ్మను నేనెరుగను' అను అనుభవములు రెండును మాయచే గలిగినవేకనుక మాయాలయకాలమందు శుద్ధబ్రహ్మ మొక్కటియే నిలుచును. అది స్వప్రకాశపరంజ్యోతి. అదియే ఆత్మ. ఆబ్రహ్మరూపమగు నాత్మయే అంతఃకరణమునుపాధిగ జేసికొని జీవుడనుపేరుతో వ్యవహరింపఁబడుచున్నది. కాన అంతఃకరణమను నుపాధినాశనమున బ్రహ్మము జీవుడనబడు భేదము నశించును.

(౩) ఒకఅద్దమున సూర్యుడు ప్రతిబింబించెననుకొనుము. అందు అద్దమువంటిదంతఃకరణము. బింబమువంటిది బ్రహ్మము. ప్రతిబింబము వంటివాడుజీవుఁడు. ఇట్లుపోల్చగా అద్దమువంటి అంతఃకరణనాశమున ప్రతిబింబరూపుడగు జీవుడుగూడా నాశనమయ్యెననఁగూడదు. అదెట్లన? అద్దము పగిలినాశనమైనపుడు

ప్రతిబింబమెట్లు బింబరూపమగు సూర్యునిలో గలియుచున్నదో మహాకాశము ఘటములోఁ బ్రవేశించి ఘటనాశనమున మరల నాఘటాకాశము మహాకాశములోనెట్లు లయమగుచున్నదో అట్లే అంతఃకరణ ప్రతిబింబితచైతన్యమగు జీవుఁడును బింబ రూప బ్రహ్మైక్యము పొందుచున్నాడు. అందుచే సర్వలయా నంతరమాత్మయొక్కటే స్వప్రకాశమైయుండునది. కావున వ్యవహారకాలమందే జీవునకు జీవుడనుపేరు. పరమార్థకాల మున (సర్వము) బ్రహ్మమే. ఈపైఁజెప్పిన విధముగ సర్వజగన్నిషేధముచే బ్రహ్మస్వరూపజ్ఞానముగలుగును. దీనినే ఆరోపితమైన జగత్తును అపవదించుటయందురు. ఇందుచే బ్రహ్మజ్ఞానముగలుగును. అందులకే వేదములు "నేతి, నేతి' అను వాక్యములచే బ్రహ్మము గోచరము" అనినవి.

( ఐదవ పరిచ్ఛేదము సంపూర్ణము )

# ఆ ర వ ప రి చ్ఛే ద ము

ఇఁక లక్షణాపద్ధతిచే బ్రహ్మను ప్రతిపాదించు ప్రకారము చెప్పుచున్నాడు. అదెట్లన? లోకమున సామాన్యముగ నొక పదమునకుఁగాని, వాక్యమునకుఁగాని, అర్థమును చెప్పెడి పద్ధతులు 3. అందు 1 అభిధ 2 లక్షణ 3 వ్యంజన అనునవి. ఈపదమునకు ఇది అర్థము అని ఈశ్వర సంకేతరూపమగు శబ్దశక్తినభిధయందురు. ఈఅభిధా వృత్తిచే నేయర్థము గలుగునో దానినే ముఖ్యార్థమని, వాచ్యార్థము అభిదేయమని

యంచురు. అనఁగా 'ఘటము' అనుపదమునకనాదిగ 'కుండ' అను నర్థమును వాడుచుండిరి. ఇదియే ఘటశబ్దమునకు ముఖ్యార్థము. దీనినే అభిధేయమందురు.

(2) ఎచ్చటనైన ముఖ్యార్థమునకు బాధ గలుగగా ఆపద సంబంధముగ నర్థమును గలుగఁజేయుట లక్షణ యందురు. ఈ లక్షణచే నేయర్థము లభించునో దానిని లక్ష్యార్థమనియు, గౌణార్థమనియు, ఔపచారికమనియు నందురు. తాత్పర్యమును గ్రహించుటకు వీలైనవృత్తినే వ్యంజనావృత్తి యందురు. దీనిచే గలుగు నర్థమును వ్యంగ్యార్థమనియు, తాత్పర్యార్థమనియుఁ బల్కుదురు. ఈ పైఁజెప్పిన వృత్తులలో రెండవదగు లక్షణావృత్తి, జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణ, అని మూఁడు విధములు. ఉన్నపదముయొక్క అర్థమును వదలి దానికి సంబంధించు మఱియొక యర్థమును ప్రతిపాదించుట జహల్లక్షణయందురు. అదెట్లన? 'గంగలో గొల్లపల్లె' అనుచోట గంగాశబ్దమునకు ముఖ్యార్థముగ 'ప్రవాహము' అను నర్థము చెప్పినచో ప్రవాహములో గొల్లపల్లెయుండుట యసంభవము గనుక ప్రవాహసంబంధమగు తీరమందు గొల్లపల్లె గలదు అని చెప్పుట. వాక్యములోనున్న పదముననర్థమును వదలక దానికి సంబంధించు మఱియొక యర్థమును ప్రతిపాదించుట అజహల్లక్షణయందురు. అదెట్లన? 'ఛత్రిధారులు వెళ్ళుచుండిరి అనునపుడు అచ్ఛత్రిధారులుగూడ వెళ్ళుచుండిరను నర్థము బోధించుట యిందు గలదు.

వాక్యములోనున్న పదములకు భావమును గుదుర్ప వలయునన్న కొంతభాగము ముఖ్యార్థమును వదలియు, కొంతభాగమును ముఖ్యార్థమును వదలకయు చెప్పుట ఉభయలక్షణ ( జహదజహల్లక్షణ ) యందురు. అదె ట్లన? వాడే ఈ దేవదత్తుడయ్యెను,అను పదములో'వాడు'అను పదము ఆ దేశ కాలములను బోధించును. ఈ అను దానికి వీడు అని యర్థము. వీడు అనుదానికి ఈ దేశకాలము లర్థములు. వాడు, వీడు నను రెండుపదములకు సంబంధమును గలుపునది 'అయ్యెను' అనుధాతువు, కాగా యీ మూడిటి కైక్యతగుదుపుటకు తచ్ఛబ్దార్థములో నా దేశకాలములను, ఇదం శబ్దార్థములో నీ దేశ కాలాదులఁ దోసివేసిన శుద్ధమగు దేవదత్తుఁడని తేలును. అనగా నొక డొకస్నేహితునితో నొకపురుషునిజూచి యిట్లు ఒకడు పలికెననుకొనుడు. 'వాడే యీ దేవదత్తుడయ్యెను? అను వాక్యములో కాశీలో నాటి దేవదత్తుడు ఈనాటి దేవదత్తునితో నిజముగా భిన్నుడే; ఎందు వల్లననగా ఆ దేశమున నాకాలముననున్న వాడాతడు, ఈ దేశ కాలములనున్న వాడీతడు, అట్లయినను 'వాడేయీతడు' అన్నప్పుడు నాటి దేవదత్తవాచ్యుడే యీ దేవదత్తుడు అగును గదా? అందుచే నిట్టి 'సోऽయం దేవదత్తః, అను వాక్యమును జహదజహల్లక్షణ యందురు. అట్లే 'సచ్చిదానందంబ్రహ్మ' సత్యం జ్ఞానమనన్తంబ్రహ్మ, ఆనన్దోబ్రహ్మ, అను మొదలగు శ్రుతులన్నియు జహల్లక్షణచే బ్రహ్మను ప్రతిపాదించు చున్నవి. అదెట్లనగా ధర్మరహితుడగు బ్రహ్మయందు సత్య,

జ్ఞాన, ఆనందాది ధర్మములుండఁదగవుగదా? అందుచే సచ్చిదాది పదములకు సచ్చిదానందాది వాక్యములకు శుద్ధ చైతన్యమందు లక్షణ. ఇట్లే చైతన్యపదమునకు గూడ శుద్ధబ్రహ్మమందే లక్షణ. చిత్, జ్ఞాన, చైతన్యములనెడి పదములు పర్యాయవాచకములే గదా; బృహదర్థరూపమగు 'బ్రహ్మ'యను శబ్దమునకు గూడ నిర్ధర్మక బ్రహ్మమందే లక్షణ. విచారింపగా ధర్మరహితుడగు బ్రహ్మయందు సదాదిపద లక్ష్యత్వము గూడ తగనిది. మఱి యెట్లు చెప్పిరి? అనగా శాస్త్రములచే వ్యవహరించుట కిది యంతయుఁ గల్పింపఁబడినది. అదియును మాయచే చెప్పుటయే. పరమార్థముగ విచారించిన శబ్దములే లేవుగనుక ఇఁక వాని ముఖ్యార్థమేమి? లక్ష్యార్థమేమి? అందుచే వ్యావహారిక కాలపర్యంత మాశబ్దములకు లక్ష్యార్థము నాశ్రయించుట యుక్తము. ఇట్లే 'తత్త్వమస్యాది' మహావాక్యములకుగూడ జహదజహల్లక్షణాశ్రయముచే శుద్ధచైతన్యమందే తాత్పర్యము: ఇందు 'తత్' శబ్దమునకు సర్వజ్ఞత్వ, సర్వాంతర్యామిత్వగుణములుగల ఈశ్వరునియందు శక్తిగలదు. 'త్వం' పదమునకు 'కించిజ్ఞత్వ' పరిచ్ఛిన్నత్వాది గుణములుగల జీవుని యందు శక్తిగలదు. ఈరెంటికి నైక్యమందు 'అసి' పదమునకు శక్తిగలదు. ఈరెంటికి విరుద్ధమగుటచే నైక్యమసంభవము గదా? అని యనరాదు. ఎందుకన? తత్పదమునకు శుద్ధ చైతన్యమందేలక్షణ, త్వం పదమునకును శుద్ధచైతన్యమందే లక్షణ, అసి పదమునకు శుద్ధచైతన్యమందే లక్షణ. అప్పుడు సర్వము చైతన్యార్థకమేయగును. అట్లయినచో చైతన్య

ద్వయముగలిగి ద్వైతభావమువచ్చునుగదా? యనిన చైతన్య లక్షకమైన తదాది పదత్రియమునకు వాక్యలక్షణాశ్రేకగని యం దేవదత్తః” అనునట్లు జహదజహాలక్షణనాశ్రయించి యద్వైత బ్రహ్మము నే చెప్పుచున్నదనవలయును. దీని నే “మహావాక్యము నకు లక్ష్యార్థముచే నఖండార్థబోధగలుగుచున్న”దనియందురు. ఇట్లే ‘అహంబ్రహ్మాస్మి’ అయమాత్మాబ్రహ్మ, ప్రజ్ఞానంబ్రహ్మ ఇత్యాది వాక్యములకుగూడ శుద్ధ చైతన్యమందే లక్షణ. ఈ లక్షణ నాశ్రయించుటచే బ్రహ్మ ప్రతిపాదింపబడినవాడాయెను.

( ఆరవ పరిచ్ఛేదము సంపూర్ణము )

# ఏ డ వ ప రి చ్ఛే ద ము

(1) ఈ విధముగ బ్రహ్మమును ప్రతిపాదించినదానికి ఫలము మోక్షమే. మోక్షమన బ్రహ్మమే. ఆబ్రహ్మముకన్న వేరయినది సర్వమనిత్యమగుటచే నదియంతయు లేనిదే! “ఇక మోక్షమనగా సర్వదుఃఖములు నశించి ఆనందమును బొందు టయే” అని చెప్పరాదు. ఎందువల్లననగా ‘ఆనందము, దుఃఖా భావము నను నవి రెండును బ్రహ్మస్వరూపములే యగును గదా?

(2) ‘ఆనందము బ్రహ్మస్వరూపమైనను అది మోక్షము గాదు. కాని ఆయానందమును బొందుటయే మోక్షము’ అని ఏలనన! ‘పొందుట’ అనునదియే మోక్షమయినచో ‘పొందెడివాడు, ‘పొందఁబడునది, పొందుట’ అనుత్రిపుటి

గలిగి అద్వైతమునకే హానిగలుగును. కావున ఆనందమును పొందుటయనగా అనందము ననుభవించుట. అనుభవమనునదే చైతన్యము. అదియేబ్రహ్మము. ఆనందబ్రహ్మల కభేదమగుట వలన నానందమే బ్రహ్మము. బ్రహ్మమేయానందము. ఆనందము నిత్యమును మనకు సిద్ధమైయుండ దానికింతగాఁ బాటు పడనేల? తత్ప్రాప్తియనుట యెట్లు పొసగుననగా అవిద్యచే విస్మృతమైన బ్రహ్మమును విద్యచే మఱలపొందుట. అదెట్లనగా? ఒకడు తనమెడలోగట్టుకొన్న మణిహారమునుమఱచి దుఃఖించుచుండ చూపరియొకడువచ్చి బోధించుటచే మఱల నామణిహారమును నూతనముగ పొందునట్లానందపడును. అట్లే యీఆనందమను బ్రహ్మమును మరచియున్న యజ్ఞలోకము గురువుచే ప్రబోధమునందిన తదుపరి క్రొత్తగా నానందము ననుభవించినట్లుండునుగాన మఱచినదానిని గుర్తుచేసికొనుటయే దీనికిఫలము.

(ఏడవ పరిచ్ఛేదము సంపూర్ణము)

# ఎనిమిదవ పరిచ్ఛేదము

(1) నేను పదియవవాడను. అనుజ్ఞానము 'నీవు పదియవవాడవు' అను ఆప్తవాక్యజ్ఞానముననే గలుగునుగదా? అనఁగా నొకగురువువద్దనున్న శిష్యులు పదిమందియు నొకని నాయకత్వమున నదికి స్నానమునకుబోయిరి. అప్పుడందఱు స్నానముచేసి తీరమున నిలుచుండగా నందలి నాయకుడు తనను

మరచి మిగిలిన 9 మందిని లెక్కపెట్టి 10 వ వాడు కానరాలేదని దుఃఖించుచుండగా పాంథుడొక్కడు దుఃఖపడునాతనిబిల్చి వ్యసనకారణము తెలిసికొని 'పదియవ వాడవు నీవు' అను వాక్యమును చెప్పుటతోడనే 'నేనే పదియవవాడను' అని తెలుసుకొని ఎట్లు వ్యసనరహితుఁడయ్యెనో అట్లే నేను బ్రహ్మనుగాదు; నాకన్న వేరుగా బ్రహ్మము కలదు. అని సంసార దుఃఖమునొందుచున్నవానికి వేదములు 'తత్త్వమసి' (నీవేబ్రహ్మము) అను మహావాక్యముచే బోధించెను. అప్పుడు సంసార దుఃఖియైన వాడు ఈయాత్మ సాక్షాత్కారమువలన బ్రహ్మము లేదనియు నేను బ్రహ్మనుగాదనియు, ద్వివిధమగు నజ్ఞానమును వదలి శుద్ధబ్రహ్మనధిగమించుచున్నాడు. ఈ వేదవాక్య బోధలేనంత కాలమజ్ఞానముతో గూడినవాడై నేను మనుష్యుడను, నేను లావుగలవాడను; నేను గుడ్డివాడను, నేను రోగిని, నేను సుఖిని, నేను దుఃఖిని, అని సర్వసంసారిత్వము ననుభవించుచున్నాడు. ఇదియంతయు నధ్యాసమూలకమే! అనగా శుద్ధ బ్రహ్మ పయిజడమగు సంసారమును గల్పించుటయే అధ్యాస ఇది యజ్ఞానమూలకము.

(2) అందువలన జ్ఞానముచే సంసారము నివృత్తమగును. దీనికింతకన్న వేరొక మార్గములేదు. అందులకే "నాన్యఃపంథావిద్యతే యనాయ" అనుశ్రుతియు ప్రమాణమిచ్చుచున్నది. అనుభవమునగూడ నింతే. రజ్జువుపయి సర్పము నారోపించి తన్మూలకమగు భయమును పొందుట యంతయు యథార్థమైన రజ్జుజ్ఞానముచే నెట్లు నిరస్తమగు

చున్నదో అట్లే సంసారముగూడ తొలగునని తెలియవల యును. అనగా దేహము, ఇంద్రియములు మొదలగు సర్వ ప్రపంచము నాత్మయం దధ్యస్తమును జేసికొని దానిచే దుఃఖవంతుడగుచున్నాడు. యథార్థమగు బ్రహ్మజ్ఞానముచే సంసారిత్వము, తన్మూలక దుఃఖముగూడ తొలఁగిపోవును. అందుచే సంసారదుఃఖము తొలఁగుటకు బ్రహ్మజ్ఞానమవ సరము. మఱియొక పద్ధతివలనఁగాదు.

(3) కర్మలచేగూడ ముక్తిగలుగదు. ఇందులకు 'నాస్త్యకృతఃకృతేన' (కర్మచే బ్రహ్మభావము లభింపదు) అని శ్రుతియు ప్రమాణమిచ్చుచున్నది. అనగా నేను బ్రాహ్మ ణుడను, నేను సోమయాజిని అను నభిమానమును గలిగించు నవే కాని కర్మలు నిర్ధర్మకమగు బ్రహ్మను పొందింపవు. అట్ల యినచో కర్మలు చేయుట వ్యర్థమేగద యనరాదు. సాత్త్విక రూపములగు కర్మలన్నియు చిత్తశుద్ధికి కారణములే. సాత్త్విక కర్మలనగా ఫలము నుద్దేశింపకచేయు కర్మలు. వీని నాచ రించిన చిత్తశుద్ధి గలవారగుదురు. ఆ కర్మలు మూడు విధ ములు. 1 మానసిక కర్మలనియు, 2 వాచిక కర్మలనియు 3 కాయికకర్మలు. అని ఇందు మానసికములు సగుణములని, నిర్గుణములని, మరల రెండువిధములుఁ ఇందు ప్రణవోపాసన గాని, 'అహంబ్రహ్మాస్మి' అను నుపాసనగాని నిర్గుణ మానసిక మనిపించుకొనును. శంఖచక్రధారియైన శ్రీమన్నారాయణుని మూర్తిని రూపములో ధ్యానించుట సగుణ 'మానసికోపాసన' మందురు. నియమముతో గూడుకొని, రామ, కృష్ణాది నామ

ముల నుచ్చరించుట 'వాచికోపాసన'మందురు. స్నాన, దాన, తర్పణ, హోమాదికర్మముల నాచరించుట 'కాయికోపాసన' మందురు. కాయికమగు నుపాసనమునకన్న వాచికమును వాచికమునకన్న మానసికమును ముఖ్యము, అదెట్లనగా జ్ఞానమునకు మానసికోపాసన సన్నిహితముగదా? అందునను సగుణమున కంటెనిర్గుణము ముఖ్యము. నిర్గుణోపాసనచే (మానసిక) బ్రహ్మాత్మైక్యజ్ఞానము. దానివలన ముక్తియనను సిద్ధాంత మిందులకు నిదర్శనము.

(4) ప్రతిబంధాదికముచే నిర్గుణోపాసన భంగమైయీ జన్మములో మనస్సు పరిపక్వముగాని పక్షమున జన్మాంతరమునగాని బ్రహ్మలోకమునగాని యది పక్వమగును. పక్వమగుట యనగా నుపాసనచే జ్ఞానోదయమగుట. సగుణోపాసనచే ముక్తిగలుగుట యనగా బ్రహ్మలోకప్రాప్తియే. అని పెద్దలందురు. అట్టివాడు హిరణ్యగర్భ శంకర, నారాయణాదులచే పరిపాలింపఁబడు బ్రహ్మలోకమునకు వెళ్ళి మరల తిరిగిరాడు. అర్చిరాదిమార్గ మీలోకమును జేర్చును. "అగ్నిర్జ్యోతి రహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం" ఇత్యాది శ్లోకములచేఁ బ్రతిపాదింపఁబడిన అగ్న్యాద్యభిమాన దేవతలాలోకమును బొందించువారు. సగుణోపాసకులుగూడ బ్రహ్మలోకమును గూర్చియే వెళ్ళుచుండిరి, సగుణనిర్గుణోపాసకులిద్దరిలో నిట్టి భేదముగలదు. నిర్గుణోపాసకు లుపాసనాఽపక్వదశయందుగూడ బ్రహ్మలోకమును బొందుదురు. పక్వదశయందు మోక్షమునుగూడ నందుదురు, సగుణోపాసకులు తప్పక బ్రహ్మ

లోకమును బొందుదురు. ఒకవేళ సగుణోపాసకులు ఈ జన్మలో నిర్గుణోపాసనద్వారా,, మహావాక్యోపదేశద్వారా గాగాని, జ్ఞానముఁబొందిలేని వారుగూడ సాక్షాన్మోక్షము నధిగమనింతురు. ఇఁక కాయిక, వాచికకర్మలచే నీజన్మమందు గాని, జన్మాంతరములలోగాని చిత్తశుద్ధి గలుగును. చిత్తశుద్ధి గల పురుషుడే సగుణబ్రహ్మోపాసనాదులందు సమర్థుడగు చున్నాడు.

(5) ఇఁక లోకములో ఫలమునుగోరి యజ్ఞాదికర్మ ముల నెవరాచరింతురో వారు కర్మజడులు. అట్టి కర్మలచే ధూమరాదిమార్గముగ చంద్రలోకాదులఁ బొంది యచ్చట భోగములనుభవించి తమ సుకృతము క్షీణించుటతోడ నేమరల తిరిగి యీలోకమునకు వత్తురు. అందులకే గీతలలో "క్షీణే పుణ్యేమర్త్యలోకం విశన్తి" అని గలదు. ధూమాది మార్గమనగా "ధూమోరాత్రిస్తథా కృష్ణష్షణ్మాసాదక్షి ణాయనమ్" అని గీతశాస్త్రప్రమాణము. ధూమాద్యభి మానముగల లోకములను క్రమముగ నున్నవి. ఇఁక అభక్ష్యభక్షణాది నిషిద్ధకర్మల నెవరుచేయుదురో, విహిత ములగు సంధ్యావందనాది కర్మల నెవరు పరిత్యాగముచేయు దురో అట్టిపాపులు అధోమార్గముగ యమపురమునకువెళ్ళి వైతరణి మొదలగు మహాయాతనల ననుభవించుచున్నారు. ఇట్టివారికిని, పైఁజెప్పినకర్మజడులకును జన్మ జరామరణాది రూపమగు సంసార బంధము వదలరానిదేయగును. ఇది సాధ నను నిరూపించు నెన్మిదవ పరిచ్ఛేదము.

( ఎనిమిదవ పరిచ్ఛేదము సంపూర్ణము )

# తొమ్మిదవ పరిచ్ఛేదము

(1) ఈలోకములో నీజన్మయందుగాని, జన్మాంతరమునగాని ఫలమునుద్దేశించియొనర్చిన యజ్ఞాదికర్మములు పాపమునుబోగొట్టి శాంతమును, దాంతమును గలుగజేయును. అప్పుడు ఉపరతుఁడు, తితిక్షగలవాఁడు, శ్రద్ధావంతుఁడు, ముముక్షువు, వివేకియునై యీ మోక్షశాస్త్రమున కధికారియగుచున్నాఁడు.

(2) శాంతమనగా అంతరింద్రియ నిగ్రహము, దాంతమనగా బహిరింద్రియనిగ్రహము. ఉపరతియనగా వైరాగ్యము. దీనినే సన్యాసమనియుఁ గొందరందురు. వివేకమనగా "ఇది నిత్యము, ఇది యనిత్య"మను జ్ఞానము "తద్విజ్ఞానాయ సగురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణి శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అను శ్రుతిచే గురూపదేశద్వారా మహావాక్యజ్ఞానమును సంపాదించుకొనవలయును.

(3) కొందరు వామదేవాదులు గురూపసదనములేకయే విజ్ఞులయినారనగా వారిభాగ్యమెట్టిదియో మనమెఱుఁగము. వారును జన్మాంతరములోనైన గురూపదేశమును బొంది యుండిరనియే యూహింపవలయును. "గురుశాస్త్రే వినాత్యంతంగంభీరం బ్రహ్మవేత్తికః" గంభీరమగు బ్రహ్మతత్త్వమును గురుశాస్త్రసహాయములేక ఎవఁడు గుర్తింపగలఁడు? అని విద్యారణ్యవచనమున్నదిగదా?

(4) కొందరు శమదమాదులులేకయే మోక్షశాస్త్రము నధిగమించినవారు గలరుగదాయనిన వారు ముందుజన్మలో నైన శమదమాదిసంపదను సంపాదించువారగుదురు. వేదోచ్చారణమాత్రము వారినామోచ్చారణతో సమానమనిరి. 'వేదాక్షరాణి యావన్తి పఠితానిద్విజోత్తమైః। తావన్తి హరినామాని కీర్తితాని న సంశయః॥ అని శాస్త్రముగలదు. ఆ హరినామ ఫలము ' సకృదుచ్చారితంయేన హరిరిత్యక్షరద్వయమ్। బద్ధః పరికరస్తేన మోక్షాయగమనం ప్రతి॥ అని చెప్పఁబడినది. 'హరి' అను రెండక్షరములనొకసారి యుచ్చరించిన మాత్రము ననే పురుషుడు మోక్షమును నిస్సంశయముగ పొందును. ఇట్లైనచో 'జ్ఞానముచేతనే కైవల్యముగదా' అని చెప్పుచు హరినామస్మరణతుల్యమైన వేదాక్షరపఠనమువల్ల మోక్షమని చెప్పుట విరోధముగదా? యనిన 'మోక్షాయగమనం ప్రతి' అనుచోట మోక్షశబ్దమునకు స్వర్గము అని యర్థము. లేదా వేదోచ్చారణముచే క్రమముగ జ్ఞానమున్ను, దానిచే కైవల్యమున్ను గలుగుననవలయును.

(5) మఱికొందఱు ఉపనిషచ్ఛాస్త్రమునువదలి ప్రబోధ చంద్రోదయాది గ్రంథముల పఠించుచుండిరిగదా వారికిమోక్ష మెట్లన వారు ధన్యులేయగుదురు. దానిచేగూడ బ్రహ్మస్వరూపమును దెలిసికొనవచ్చును. ఒకవేళ ప్రతిబంధనకర్మచే నాజ్ఞానము గలుగకపోయినను తత్త్వమును జన్మాంతరములో స్ఫురింపఁజేయు పుణ్యావిశేషము నైన గలిగించును. అందులకే "అనేకజన్మ సంసిద్ధఃతతో యాతి పరాంగతిమ్" (అనగా

ననేక జన్మములకై ననుపురుషు డగువాడు జ్ఞానమును సంపాదించి మోక్షము నొందును) అని గీతాశాస్త్రము గలదు. అందుచే అధికారులచేత అనధికారులచేతగూడ తర్కాది శాస్త్రములవదలి మోక్షశాస్త్రమందే విచారణ చేయబడఁదగినది. కాని బ్రాహ్మణు లుపనిషత్తులయందు, స్త్రీ శూద్రాదులు ప్రబోధ చంద్రోదయాది గ్రంథములందు నధికారులు." స్త్రీ శూద్ర ద్విజబంధూనాంత్రయీన శ్రుతి గోచరా" అను ప్రమాణముచే 'స్త్రీ శూద్రాదుల ననుగ్రహించుటకే పురాణాదులన్నియుఁ బ్రవర్తిల్లినవి.

(6) బ్రాహ్మణులు వేదములనే (ఉపనిషత్తులనే) చదువవలయునని, ప్రబోధచంద్రోదయాది గ్రంథములఁ జదువగూడదని నిషేధములేదు. కాని స్త్రీ శూద్రులకు వేదాంతశాస్త్రమందు ప్రవృత్తిమాత్రము దూష్యము. అట్లు చేసినయెడల చాల ప్రత్యవాయము (దోషము)గలదు. ఇఁక బ్రహ్మజ్ఞానము గలవారెవ్వరైనను అట్టివారిది విన వచ్చును. ఇదివినగూడదు" అని విధి నిషేధము లేవియు గలవారుకారు. అందులకే నిస్త్రైగుణ్యేపథివిచరతాంకోవిధిఃకో నిషేధః" అని శంకరవచనము. "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అను శ్రుతిచే బ్రహ్మవేత్తయే బ్రహ్మయగునుగాన అట్టి బ్రహ్మకు విధి నిషేధములులేవని భావము. అదెట్లనగా బావి త్రవ్వ సాధనములు నీరు పడిన తదుపరి యెట్లు వదలిపెట్టఁబడుచున్నవో అట్లే వేదాన్తవిచారముచే జ్ఞానము లభింపగా శాస్త్రమునుగూడ వదలవచ్చునని తాత్పర్యము. అపరోక్ష

బ్రహ్మ సాక్షాత్కారమగు పర్యంతము విచారణమును వదల రాదు. అందులకే "ఆసుప్తేరామృతేఃకాలంనయే ద్వేదాన్త చిన్తయా" అని శాస్త్రములు నుడువుచున్నవి.

(7) బ్రహ్మాపరోక్ష జ్ఞానమెవనికిఁ గలుగునో ఆతడు కృతకృత్యుఁడే యగును; అతడాచరించరింపఁదగిన దేదియు లేదు. ఎంతమాత్రమును లేదు. ఇట్లే బ్రహ్మసాక్షాత్కార మును బొందినవారుగూడ ప్రారబ్ధము ననుసరించి దేహ పాతమువఱకు విలాసముగ శ్రీకృష్ణునివలె కర్మల నొనరించు చునే యున్నారు. ఆకర్మాచరణమువలన వారికెట్టి బంధమును గలుగఁబోదు. అదెట్లనగ బంధకాంశము జ్ఞానాగ్నిచే దహింప బడిపోవుచున్నది. సామాన్యముగ లోకమున వేపుడుగింజలు మొలకెత్తు శక్తిగలవి కావుగదా? అందుచేతనే బ్రహ్మవేత్త తన యిష్టమువచ్చినట్లే కర్మ యొనర్చినను బద్ధుడుకాడు. అట్లయినచో నిష్ప్రయోజనముగ బ్రహ్మవేత్తలు కర్మలాచ రించుట యెందులకనగా 'లోకము ననుగ్రహించుటయే యాకర్మల నాచరించుటకు ప్రయోజనము, అని శ్రీకృష్ణపర మాత్మాదుల కర్మ విలాసములవలన దెలియుచున్నది. ఇది వేదాంత శాస్త్రమందధికారి నిరూపణమను తొమ్మిదవ పరిచ్ఛేదము.

( తొమ్మిదవ పరిచ్ఛేదము సంపూర్ణము )

# పదియవ పరిచ్ఛేదము

జ్ఞానమనునది రెండువిధములు. (1) నిత్యజ్ఞానము, (2) వృత్తిజ్ఞానము అని. ఈ వృత్తిజ్ఞానమునే జన్యజ్ఞానమందురు. నైయాయికులు (తార్కికులు) జ్ఞానమును వృత్తిజ్ఞానమున కంటె వేఱయినదని తెలియక వృత్తినే జ్ఞానమనుచుందురు.

ఈ ఆత్మను జ్ఞానముగల ద్రవ్యమనియందురు. అది యుక్తముగాదు. అదెట్లనగా వారిమతములో సవిద్యయను వృత్తి నంగీకరింపరు. ఎందుకన సుషుప్తియం దంతఃకరణము లయమగుటచే అంతఃకరణమందు వృత్తిపుట్టదుగదా? అప్పుడు సుషుప్తియనునది అసాక్షికమైనదగును. వృత్తియనున దంతఃకరణమున లేనపుడు ఆత్మపృథివ్యాదిద్రవ్యమువలె జడమైన దగును. జడమైనది ఘటాదికమువలె అసాక్షికమైనది. అసాక్షికమైన పదార్థము నంగీకరింపగూడదుగదా? మఱియు ససాక్షికమైన ఈ సుషుప్తియనునదే లేకుండవలసివచ్చును. అది చాల అనిష్టమైన విషయమగును. సుషుప్తియనునది సర్వానుభవసిద్ధమైనదిగనుక నట్టి దానిని కాదనుటకు వీలులేనిది. అందుచే వృత్తిజ్ఞానము నాత్మయనరాదు. నిత్యజ్ఞానమునే ఆత్మయనవలయును.

(2) వృత్తియనునది రెండువిధములు. అవిద్యావృత్తియని, అంతఃకరణవృత్తియని. రజ్జుసర్పాదులు, స్వప్నరథాదులు. సుషుప్తియందలి సుఖానందములు అవిద్యావృత్తి విషయములు. ఘటాది పదార్థములు అంతఃకరణ వృత్తి విషయ

ములు అని తెలియవలెను. అంతఃకరణమందు, అంతరంగ సుఖాదివిషయము 2 బహిర్గతఘటాది విషయమునని రెండు వృత్తులుగలవు. లేదా బహిరింద్రియ సాపేక్షగల వృత్తి యొకటి. తన్నిరపేక్షగల వృత్తియొక్కటి ఘటాదిబాహ్యార్థ విషయకవృత్తి, చక్షురింద్రియ సాపేక్షమైనది. సుఖాదివిష యము ఇంద్రియసాపేక్షకానిది. ఈ వృత్తిజ్ఞానము బహు విధము, ఘటజ్ఞానము. పటజ్ఞానము, కుడ్యజ్ఞానము, కుసూల జ్ఞానము మొదలగునవి. ఈపైఁజెప్పఁబడిన జ్ఞానములన్నియు అంతఃకరణ వృత్తులుగదా? వృత్తులన్నియు జడములుగదా? దీనిని జ్ఞాన మెట్లందురు? అనగా చైతన్యమందు ప్రతిఫలించు టచే వృత్తికి జ్ఞానమని ఔపచారికార్థము. నిత్యరూపమగు వృత్తిజ్ఞాన మొక్కటియే. అజ్ఞానమునకు విరోధములేకుండగనే ఆత్మయందజ్ఞానము కల్పితమైనది. అదెట్లనగా రజ్జువుయందు కల్పించిన సర్పము రజ్జువునకు బాధకముగాదు. అధిష్ఠానవిష యకమగు వృత్తి జ్ఞానము కల్పితజ్ఞానమును మాత్రము బాధిం చును. లోకములో రజ్జువుపై కల్పించిన సర్పమురజ్జు జ్ఞానానం తరము కల్పితసర్పజ్ఞానబాధకమగుట లేదా? అదినిత్యమనుభ వములో నున్నట్టిదే. ఇందులకొక యుదాహరణము.

(3) సూర్యకాంతి స్వయముగ తగులఁబెట్టలేనిదైనను ఒకవిధమగు నద్దము (కేంద్రీకరణదర్పణము) లో నాకాంతి సంక్రమించినచో తగులబెట్టుటకెట్లు సమర్థమగుచున్నదో అట్లే అజ్ఞానమును నాశనముచేయని యాత్మ, వృత్తియందు ప్రతి ఫలించినచో నా యజ్ఞానమునకే నాశకమగును, (అంతఃకరణ

ప్రతిఫలితయాత్మ వృత్తి, అజ్ఞానధ్వంసకమగుట నిత్యమను భవములో నున్నదే. అంతఃకరణయందు వృత్తిలేనప్పుడు ఘటాదివిషయజ్ఞానమే గలుగదుగదా? అనెడి సంగతియు ననుభవసిద్ధమే. ఇట్లనినచో ఘటజ్ఞానాభావమును పోగొట్టిన దేవృత్తియని నిర్ధరించు టెందులకు? అని ప్రశ్నపూర్వపక్షి మరల వేసినచో నప్పుడు ఘటజ్ఞానమే లేకుండు వలసివచ్చును. అందుచే ననుభవసిద్ధమైన దానిని కాదనుటకు వీలులేదు. కాబట్టియే 'నేను ఘటమును తెలిసికొంటిని' అనెడి యనుభవము అంతఃకరణయందు వృత్త్యుదయమైన తదుపరియే గలుగుచున్నది. ఘటజ్ఞానముగలిగిన దనగా ఘటాజ్ఞానము నశించిన నేగదా? రెండు వృత్తులొకేసారి యుండవు.) అందు వలన ఘటజ్ఞానము ఘటాజ్ఞాన నాశకమే యగును.

(4) ఏ వృత్తియే పదార్థజ్ఞానమును గలిగించునో ఆవృత్తి తత్పదార్థాజ్ఞానమునుగూడ నిరసించును, అనిసాంప్రదాయము. అందుచే ఘటవిషయక ఘటాకారవృత్తి ఘటాభావజ్ఞాననాశకమగును, కావున ఘటజ్ఞానవృత్తి ఘటాజ్ఞాన నాశకేమ యగునని స్పష్టము.

(5) అందుచే ప్రకృతమునగూడ మహావాక్యార్థ విచారణచే బ్రహ్మాకార వృత్తి యుదయించును. ఆ వృత్తిచే బ్రహ్మానావరించిన అజ్ఞానము నశించును. అనగ మనకందఱకు (బ్రహ్మాను తెలిసికొనినవారికి) 'నేను బ్రహ్మానుగాను, నేను బ్రహ్మాను తెలిసికొనుటలేదు' అనెడి యనుభవములో

నున్నట్టి యజ్ఞానము నశించును. ఆ అజ్ఞానము నశించుట తోడనే బ్రహ్మ సాక్షాత్కారమగును. బ్రహ్మము ప్రమేయము గదా! జ్ఞాన జన్యమెట్లగునని ప్రశ్నగలుగగా సమాధాన మును జెప్పుచున్నాడు. వేదాన్తవాక్యములచే విచారింపగా అజ్ఞానాంధకారము నశించి జ్ఞానస్వరూపమగు బ్రహ్మజ్ఞానము దయించును. ఇది వృత్తిని నిరూపించు పదియవ పరిచ్ఛేదము.

(పదియవ పరిచ్ఛేదము సంపూర్ణము.)

# పదునొకండవ పరిచ్ఛేదము

ఈ పైఁజూపఁబడిన దృశ్యము. దృక్కులనెడి పదార్థములనే క్షేత్రము, క్షేత్రజ్ఞుఁడను పదములచే వ్యవహరింతురు అహంకారము మొదలు దేహాన్తము వఱకు సమస్తమగు కార్యకరణ జాతమున్ను, అజ్ఞానమున్ను క్షేత్రము అను పద వాచ్యమే యగును. దీని నెవరు గుర్తెరుంగునో వాడే క్షేత్రజ్ఞుడని పిలువబడుచున్నాడు. జ్ఞానస్వరూపమైనదైనను ఆత్మ స్వయంప్రకాశమై సర్వమును ప్రకాశింపఁజేయుచున్నదిగాన క్షేత్రజ్ఞుడని చెప్పఁబడుచున్నది.

(2) అంతఃకరణము, చక్షురాదీంద్రియ సమూహ మును జ్ఞానసాధనములై జ్ఞేయములనుపించుకొనును. నేత్ర ముచే చూచుచున్నాను; మనస్సుతో ధ్యానించుచున్నాను.

అనెడి యనుభవము ప్రసిద్ధమేగద; ఇది నేత్రము, ఇది మనస్సు అనియు ననుభవమునగలదు. 'నేను' చూచుచున్నాను' అనెడి యనుభవమువలన అహంకారమే క్షేత్రజ్ఞుడు అని యనిరాదు. 'నేను చూచుచున్నాను' అను దానిలో 'నేను' అను పదము నకు అహంకారము వాచ్యమైనను లక్ష్యమాత్మయే.

(3) లేదా? చైతన్యముతో కూడిన అహంకారమే జ్ఞాత యగునుగాని కేవలాహంకారముకాదు. అది జడస్వరూపము. కేవలాహంకారగతమైన చైతన్యమే జ్ఞాతృశబ్దవాచ్యము. అట్లయినచో నహంకార మాత్మయందురాయన నట్లనగూడదు. ఎందువల్లననగా 'నాకు అహంకారముగలదు'. అనెడి యనుభవమున తనకును అహంకారమునకును భేదముండియే యున్నది. ఇదిగాక అహంకారమాత్మయే అనినచో సుషుప్త్యాదుల యందహంకారము నశించుచున్నదిగద? ఆత్మయేయైన చోనది నిత్యము "అజోనిత్యః" అను వేదవచనముచే నాత్మ నాశనమగునదిగాదు. అసాక్షికమగునాత్మ నాశనము నంగీకరించుట ననుచితము. ఆత్మకన్న భిన్నమగు సాక్షి లేదు. ఆత్మ సర్వసాక్షియైనదికావున అహంకారము క్షేత్రజ్ఞుడుకాదు. కాగా కూటస్థుడు సాక్షిశబ్దవాచ్యుడు.

(4) అనఁగా అంతఃకరణోపాధికమగు ఆత్మచైతన్యమే సాక్షియనబడునది. ఈ సాక్షిరూపమగు క్షేత్రజ్ఞుడొక్కడే ఉపాధిభూతమగు అంతఃకరణబేధముచే అనేకవిధములగతోచుచున్నాడు. ఈ వేదాంతమున ఉపాధియనియు, విశేషణమనియు రెండుసంజ్ఞలుగలవు. అందు ఉపాధియనగా కార్యమందన్వ

యింపక భేధమును సంపాదించునది. కార్యమందన్వయించుచు భేదమును సంపాదించునది విశేషణము.

ఇఁక ఆత్మ క్షేత్రజ్ఞుడనుటయు వ్యావహారికమే. యథార్థములో క్షేత్రమనునదే లేదుగనుక క్షేత్రజ్ఞుడనుటయునయథార్థమే. మఱియొకప్రశ్న:- జ్ఞాతయనగ జ్ఞానమున కాశ్రయమైనవాడు. క్షేత్రజ్ఞాన మెవనికిగలదో వాడు క్షేత్రజ్ఞుడు అగునుకదా!. అందుచే క్షేత్రజ్ఞుడు జ్ఞానస్వరూపుడుగాడు. జ్ఞానాశ్రయమగు ద్రవ్యమే క్షేత్రజ్ఞుడు. అని ప్రశ్నకలిగినచో నట్లనరాదు. క్షేత్రముఅనెడి జ్ఞానముకలిగినవృత్తి అంతఃకరణముననుదయించునుగాన జ్ఞానాశ్రయమంతఃకరణ ద్రవ్యము. నిర్వికల్పము, నిరాకారమైన జ్ఞానమేదియో దానికాశ్రయమంతఃకరణముకాదు. అంతఃకరణమునకే జ్ఞానమాశ్రయమని సిద్ధాంతము. ఆ అంతఃకరణాశ్రయ జ్ఞానమే ఆత్మ.

(5) సర్వమును చైతన్యమందధ్యస్థమైనదే. జ్ఞానమునకాత్మ ఆశ్రయమనరాదు. ఏలయన ఆత్మ జ్ఞానస్వరూపమే జ్ఞానముగలది యాత్మయని చెప్పినచో నాత్మకుగూడ మరియొక జ్ఞానస్వరూపముండవలసివచ్చును. అది తగనిది. ఆత్మసర్వమునకు స్వరూపభూతమైనది. కాబట్టి జ్ఞానస్వరూపమే యాత్మయనియు, అది సర్వమును ప్రకాశింపఁజేయునదనియు అదియే జ్ఞాతయనియు, సాక్షియనియుఁజెప్పఁదగినది. ఇందులకు 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనిశ్రుతియుప్రమాణము. ఆత్మయే జ్ఞానమునాశ్రయించినదనినచో అద్వైతశ్రుతికి విరోధముగూడ కలుగును. అదెట్లన? జ్ఞానమనియు, జ్ఞాతయనియు ద్వైతమేర్పడును. అట్ల

గుట అద్వైతసమ్మతముగాదు. "క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి సర్వ క్షేత్రేషు భారత" అని గీతావచనము వలన నీశ్వరుడును క్షేత్రజ్ఞుడే. అందువనే "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున! తిష్ఠతి" అను వచనముచే సర్వుల హృదయమున నీశ్వరుడు గలడు. కావున ఈశ్వరుడనువాడే క్షేత్రజ్ఞుడు. అనగ ఈశ్వరుడు ప్రత్యగూపుడై క్షేత్రజ్ఞుడను పేరుతోనున్నాడు.

(6) ప్రత్యక్ అనగా ఆత్మకు నామాంతరము. ప్రత్యగ్రూపుడైన కూటస్థునిగాని, క్షేత్రజ్ఞునిగాని ఈశ్వరుఁడనుటచే సర్వాంతర్యామిత్వము గలుగునుగదా? "అది యెట్లు పొసగును" అని శంకఁజేయపీలులేదు. అదెట్లన? వికారములేని అయస్కాంత సాన్నిధ్యమున సూచ్యాదులకెట్లు చలనమో అట్లే కూటస్థుని సాన్నిధ్యమున నంతఃకరణ వ్యాపారము గలుగుటచే నీశ్వరునకు సర్వాంతర్యామిత్వము నంగీకరించిరి. అట్లు గానిచో నీశ్వరుడు రాజువలె "ఆజ్ఞాపించుట"వంటి వికారము గలవాడగును. అది సర్వసమ్మతముగాదు. అట్లు ఈశ్వరుడు వికారుడని చెప్పిన అనిత్యుడనియు ననిష్టము గలుగును. అందుచే నీశ్వరుడే క్షేత్రజ్ఞుడనియు భావము.

(7) ఇట్లు చెప్పినచో (క్షేత్రజ్ఞుడే యీశ్వరుడని) "మాయచే నావరింపఁబడిన వాడీశ్వరుడనియు, అంతఃకరణముతో గూడినవాడు సాక్షి (కూటస్థుడు)" అని ప్రథమ ప్రకరణములోఁ జెప్పినదానికి విరోధమగునుగదా యనిన ఆభేదము స్వయముగ కల్పించినది. విశేషణాంశలో భేదమే

గాని విశేష్యాంశలో సర్వమభిన్నమే యగును. వసుదేవ పుత్రుడు కృష్ణుడనియు, శంఖచక్రధారి విష్ణువనియు పలికి నపుడు విశేషణభేదముచే భేదమేగాని విశేష్యములో నభేద మెట్లో అట్లే అంతఃకరణావృతుడు సాక్షియనియు, మాయా వృతుడీశ్వరుడనియు, అభేదపర్యవసాయి. ఎవడు మాయా వృతుడో ఆతడే అంతఃకరణోపహితుడని స్పష్టార్థము. చైతన్య మంతయు నొక్కటే యగుటచే నీయభేద మంగీకరింపవలసి వచ్చినది. ఇట్లు చెప్పుటచే జీవ, ఈశ్వర, కూటస్థ, బ్రహ్మ నామకమగు చాతుర్విధ్యము గలది చైతన్యమని పిండీకృతార్థ మగును.

(8) నిజముగ విచారించిన ఘటమఠాకాశము లుపాధి భేదముచే భిన్నములైనను మహాకాశముతో నెట్లభిన్న మైనవో అట్లే అంతఃకరణ, మాయోపాధికములయిన జీవ, కూటస్థ, ఈశ్వర బ్రహ్మములు సర్వమును బ్రహ్మకన్న భేదముగలవి కావు. జీవుడు కూటస్థుడే, ఈశ్వరుడు బ్రహ్మయే కూటస్థుడు బ్రహ్మయే అని యథార్థస్థితిలో జెప్పవలెను. అందుచే క్షేత్రజ్ఞమైన చైతన్యమునకు జీవత్వము, ఈశ్వ రత్వము బ్రహ్మత్వము సిద్ధమయినది. కావున యెవడు ఇది క్షేత్రమనియు, నేను క్షేత్రజ్ఞుడననియు, తెలిసికొనుచున్నాడో ఆతడు బ్రహ్మయే. "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అని వేద ప్రమాణము. బ్రహ్మవేత్తయే బ్రహ్మయగుచున్నాడనగా వేదనరూపకమగు కర్త, కర్మ, క్రియాది త్రిపుటి యేర్పడి అద్వైతహానియగునుగదా యనిన అట్లుగాదు. 'నన్ను నేను

తెలిసికొనుచున్నాను' అన్నప్పుడు కర్తృ, కర్మ, క్రియాది భేదమెట్లులేదో అట్లే ఇచ్చటను విరోధములేదు. అదియు గాక ఈ వేదనము క్రియగాదు. అనుభవ మనవలయును. అది యంతయు నాత్మస్వరూపమే. నేను బ్రహ్మను, అనెడి యను భవమేదియో అదియు బ్రహ్మమే. ఇట్లనిన శ్రుతి విరోధము గూడ లేకుండును.

ఇది క్షేత్రజ్ఞుని నిరూపించునదగు పదునొకండవ పరిచ్ఛేదము.

( పదునొకండవ పరిచ్ఛేదము సంపూర్ణము. )

# పంద్రెండవ పరిచ్ఛేదము

(1) దృగ్భూతమగు నాత్మ స్వప్రకాశమై సర్వమును బ్రకాశింపఁజేయునది గనుక చిద్రూపమనియు, సర్వనాశన మైనను తాను మాత్రము మిగిలియుండుటచేతను, అన్ని విధములగు విషయములఁ గల్పించుట కధిష్ఠానమగుటచేతను, సద్రూపమనియు, మిక్కిలి ప్రీతికి పాత్రమై సర్వదుఃఖములు లేనిదియు నగుటచే నానందరూపమునైనది. ఇందు సచ్చి ద్రూపములు రెండును పూర్వమే వర్ణింపఁబడినవి. ఇఁక నానందరూపమును వర్ణించుదము.

(2) ఆత్మయందు సర్వదుఃఖములు లేకుండుట సుషు ప్త్యాదులం దందఱికి ననుభూతమే. అందులకే "అద్వస్సన్నంధో

భవతి” అని వేదవాక్యము. లోకములోని విషయము లన్నియు నశించినను, ఆత్మయను న దొక్కటి శేషించియుం డును. కావున దానియందే పరమప్రీతి. సర్వపదార్థములు శేషములై ఆత్మోపయోగ్యములే గావున ఉత్కృష్ట ప్రేమ కాత్మయే స్థానము. అదెట్లనగా?

(3) మంచి శబ్దములు గల వేదాదులు, సుఖస్పర్శగల మలయానిలాదులు, అందములగు కర్ణాభరణాదులు, మధుర రసోపేతములగు మామిడి మొదలుగాగల ఫలములు, పరి మళితమగు పుష్పాదులు, సర్వధాన్యములుగల భూములు మొదలగునవి, అధికముగ పాలనిచ్చుగోవులును, చిత్రవిచిత్ర ములగు వసతులును, ధనాగారములును, సురూపవతులగు కాంతలును, అనేక విద్యలుగల పుత్రులు మొదలగువారును, అధికమగు సామర్థ్యముగల శరీరేంద్రియాదులును, తానను భవింప వీలగుట గలవి గనుకనే ప్రియములైనవి. అవి యను భవములోనున్నపుడు ప్రీతియుసంభవించుచున్నది; అవి లభింప నప్పుడు ద్వేషాదులు సంభవించుచున్నవి. గావున ఆత్మయే పరమప్రీతికి స్థానము.

(4) శరీరము నాత్మతో తాదాత్మ్యము (ఇనుప ముద్దను నిప్పుతో గలిపినట్లు) చేసి “నేను మనుష్యుడను, నేను బ్రాహ్మణుడను” అను నభిమానముతో గూడి పురుషుడు శరీరమునే ఆత్మయని తలంచుచున్నాడు. అందుచే శరీరోప యోగములగు పుష్పమాలికాది పుత్రాన్న విషయము లన్నియు ప్రీతిభాజనములనుచున్నవి. అహంకారముతో నాత్మ నధ్యాసచేసి (తాదాత్మ్యముగ) “నేనుకర్తను, నేను

భోక్తను" అని యభిమానపడు పురుషుఁడు 'చూచుట' వెళ్ళుట, మిథున కర్మచేయుట, మొదలగు వానినెరవేర్చు శరీరేంద్రియములు తనకు (ఆత్మకు) అంగములని భావించు చున్నాడు. ఇదంతయు శేషిరూపమగు నాత్మ తాదాత్మ్యా ధ్యాసమూలకమే.

(5) ఈ అహంకారము ఆత్మతాదాత్మ్యము గలదై ప్రియాతిప్రియమగుచున్నది. అహంకారము నాత్మనుండి విడదీసినయెడల నాత్మయే ప్రియతమమగుచున్నది. లేనిచో నహంకార నాశనమగు (కర్తృత్వ, భోక్తృత్వములులేని) సుషుప్తిసుఖము సర్వులచే కోరబడుట ఏలసంభవించును? నేను చూచుచున్నాను. 'నేను అనుభవించుచున్నాను' అను వ్యవహారమున నుపయుక్తమైనదగుటచే నాత్మార్థము అహంకారము ప్రియాతిప్రియమనియే యనవలయును. అందుచే నాత్మ ఆనంద రూపమైనది. ఆత్మఆనంద రూపమేగానిచో పామరులుమొదలు పండితులవఱకు సర్వులు సుఖదాయకమని సుషుప్త్యవస్థనే ఏల కోరుదురు? ఇందొక్క విశేషముమాత్రముకలదు. పండితులగు వారు సమాధినిగూడ కోరుదురు. అనగా సుషుప్తియందునను, సమాధియందునను ఆత్మానందస్ఫూర్తిగలదు. అది సమానమే! కాని సుషుప్తియందలి యాత్మానంద మజ్ఞానావృతము. సమాధియందలి యాత్మానందము ఆయావరణములేని స్వచ్ఛమైనది. అదియెట్లనగా బ్రహ్మజ్ఞానముచే నా యజ్ఞానావరకము నశించి

పోవును. అప్పుడు స్వచ్ఛమగు నాత్మానంద మనుభవించును. కావున సమాధి సుషుప్తులకుగల భేదమింతటిదేనని గుర్తెఱుంగ వలయును.

ఇది ఆత్మకు ఆనందమును నిరూపించునట్టిదగు

( పండ్రెండవ పరిచ్ఛేదము సంపూర్ణము )

# పదమూడవ పరిచ్ఛేదము

(1) ఆత్మప్రాప్తికుపాయము సాంఖ్యమెట్టులో అట్టులే యోగముగూడ సాధనము. అనగా యోగము సాంఖ్యమును భేదములేనివి. అందులకే "తత్కారణం సాంఖ్యం యోగాభిపన్నమ్" అను శ్రుతిగలదు. అట్లయినచో "ఏకంసాఙ్ఖ్యఞ్చ యోగఞ్చ యః పశ్యతి సపశ్యతి" అను గీతావచనము సాంఖ్య యోగములకు భేదమును దెల్పుచున్నదిగదా? అన నీరెండిటి కిని స్వరూపములో భేదమున్నను ఫలములో నైక్యమేనని గీతాకారుని భావము. అందులకే "సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః" అని గీతావచనము. అందుచే యోగసాంఖ్యములు రెండు నభిన్నమైనవి.

(2) యోగమనగా చిత్తవృత్తి నరికట్టుట. ఇందునను (సమాధియోగమున) యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణము, సమాధి అనున వెనిమిది యంగములుగలవు. వీనినే యోగాంగములని, సమాధ్యంగములుననియందురు. అనగా సమాధికివి సాధనము

లనిభావము. ఈ సమాధియనునది రెండువిధములు. 1 సవికల్ప మని, 2 నిర్వికల్పమనియు : ఇందు సవికల్ప సమాధియనగా "అహం బ్రహ్మాస్మి" అనుజ్ఞాన మవిచ్ఛిన్నముగ గలిగియుం డుట. ఇఁక నిర్వికల్ప సమాధియనునది బ్రహ్మాత్మైక్యసిద్ధికి మూలము. అనగా గాలిలేనిచోటనున్న దీపమువలె మనస్సు చలనములేక యూరకుండుట. నిద్రయందువలె నీ సమాధి యందు మనోలయముగల్గదు. . జాగ్రత్స్వప్నము లందువలె మనస్సు విక్షేపము (చలనాత్మకము) గలదికాదు. కాగా మనస్సు పరమాత్మయందు విశ్రాంతిజెంది ఆత్మస్వరూపము స్వయముగ భాసించుట. మేఘము తొలగిన తదుపరి సూర్యు డెట్లు స్పష్టముగఁ గనబడునో అట్లే మనస్సు వ్యాపార శూన్యమైయున్నపు డాత్మస్ఫూర్తి గలుగును.

(3) అట్లని ఆత్మదర్శనమునకు మనస్సు సాధనమనఁ దగదు. అందులకే "యతోవాచో నివర్తంతే, అప్రాప్యమన సాసహ" అను శ్రుతియు సహాయమగుచున్నది. అట్లయినచో "మనసైవాను ద్రష్టవ్యమ్" అనుశ్రుతి విరోధమును గల్పించు చున్నదిగదా? అనిన 'సంస్కారమునుపొందిన మనస్సుతో చూడదగినదను నర్థము నాశ్రుతిలో వివరించుకొననలయును. సంస్కారమనగా సర్వవ్యాపారముల నశింపఁజేసి యేకాగ్రత యందుంచుట అని అర్థము. ఇదిగాక బ్రహ్మ (ఆత్మ) దర్శన ములో సంస్కారమగు మనస్సు గలిగియుండుట హేతువుగాని దర్శనమునకు సాధనముగాదు. అందుచే "మనసైవ" అను స్థలముననున్న తృతీయా విభక్తిగూడ దోషరహితమగును.

లేదా సాధనమే మనస్సు (ఆత్మదర్శనములో) అనినచో వేదాంతవాక్యవిచారదక్షమైన మనస్సుచే నాత్మదర్శనము గలుగును అని "మనసైవానుద్రష్టవ్యమ్" అను శ్రుతి కర్థము జెప్పినను జెప్పవచ్చును. అందునకే జ్ఞాతవ్యమని దానియర్థము.

(4) ఈపై జెప్పినట్లుగాక పూర్వపక్షమతమునననుసరించి ఆత్మదర్శనములో మనస్సు సాధనమను నెడల ఆత్మ స్వప్రకాశముగాదనియు, వేదవాక్యము విరోధమగు నర్థమును బోధించినదనియుఁ జెప్పవలసివచ్చును. అది కూడదుగదా? ఇదిగాక మనస్సుచే నాత్మ తెలియఁదగినదందుమా? ఘటపదాది విషయములు (వస్తువులు) ఎట్లు జడములో అట్లే ఆత్మగూడ జడమైనదగును. కేవలమనస్సును సాధనముగ నంగీకరింతుమేని పరోక్షాత్మదర్శనమునకని చెప్పినఁదగును. కాని అపరోక్షాత్మ సాక్షాత్కారములో నెప్పుడును మనస్సు సాధనముగాదు. ఇట్లుగాదనిన "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" అను శ్రుతి వాక్యము విరోధమును బుట్టించును. కావున బ్రహ్మ సాక్షాత్కారమున నడుమనుండదగినదే యొక్కటియు లేదు. అందులకే 'అపరోక్షాత్ = అనగా అపరోక్షమని యర్థము. అచటి పంచమీవిభక్తి ఛాందసము. మఱియు నాత్మను ఘటాదులవలె జడమగునట్లర్థముఁ జేసితిమేని అనిత్యమగు వస్తువుగ చెప్పినట్లగును. అట్లుగా చెప్పుట దోషము సంభవించును. అందుచే సర్వవ్యాపారశూన్యమై యచంచలస్థితిగల మనస్సుతో నాత్మదర్శనముగలుగునని నిష్కృష్టార్థము. ఇందు

నకు భాగవతములో హంసగుహ్యస్తవరాజములోని

శ్లో॥ యదోపరామో మనసోహినామ ।

అను పద్యమును ప్రమాణమిచ్చుచున్నాడు. ఇందు పరమ వ్యాపారముగల మనస్సు ఆత్మదర్శనోపయోగి యగునని ప్రథమ పాదమునగలదు.

ఈ పైఁజూపఁబడిన సమాధ్యవస్థ మానవునకు జీవితములోనొక్క క్షణకాలము లభించినను ఆత్మవిషయమైన సంశయాదులు, ఊహాలుదయించి శోభనుగలిగించినదై కృతకృత్యునిగఁ జేయును.

(5) కేవలయోగులగువారు సమాధియందాత్మానుసంధానము జేయుచున్నను బ్రహ్మాత్మల కభేదమను సంగతిని గుర్తెఱుఁగరు. అందులకే గురూపసదనము (గురువువద్దకు వెళ్ళుట) మహావాక్యార్థ విచారణమను నంశములురెండును యోగులకైన నావశ్యకములే. కాని పామరులకు గురుబోధపూర్వకముగ మహావాక్యార్థ విచారణము జరిగినను వెనువెంటనే బ్రహ్మసాక్షాత్కారముగాదు; కాని యోగులు (సమాధిలో నాత్మసాక్షాత్కారరూపసమాధిస్థులు) గురుబోధనాపూర్వకముగ మహావాక్యార్థవిచారణచేసిన వెనువెంటనే బ్రహ్మసాక్షాత్కారమును బొందుదురు. ఎందువల్లననఁగా తామొనరించు యోగమనెడి యగ్నిచే ప్రతిబంధకరూపములగు దూదిపీచులు నశించినవారగుటచేతను, చిత్తము చలనరాహిత్యమగుటవలనను.

(6) అందులకే 'అనంతములగు జన్మలయొక్క పుణ్య పరిపాకవశముచే లభించునదే సమాధి' అని పెద్దలు వక్కాణించిరి. యోగులకుగూడ నీ సమాధియనునది కష్టసాధ్యమైనదే. ఇందులకు గీతావచనమే ప్రమాణము.

"చంచలం హి మనః" అని.

ఇక జ్ఞానులకీ సమాధి యనునది సులభమైనదే. ఎందువల్లననగా! జ్ఞానియగువాడు "నేను మనస్సుగాదు. ఈ మనస్సు నాదిగాదు" అనెడి అహం, మమాధ్యాసలు లేనివాడగుటచే మనస్సు ఉపరత వ్యాపారమైయుండును.

ఇది సమాధిని నిరూపించెడిదగు
(పదమూడవ పరిచ్ఛేదము సంపూర్ణము.)

# పదునాల్గవ పరిచ్ఛేదము

(1) భక్తియనగా పూజ్యులగువారి విషయమై ప్రీతి. పూజ్యులన, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుఁడు మొదలగు నీశ్వరాంశ సంభూతులైన దేవతలు. అనగా నొక్క యీశ్వరుఁడే తన మాయానిష్ఠ గుణములగు సత్వ, రజ, స్తమో రూపాంశ సంభూతుడని నిర్ణయమైన విషయమేగద?

(2) మాయావృతు డీశ్వరుడనెడి విషయము ప్రథమ పరిచ్ఛేదమునఁ జెప్పఁబడియే యున్నది. ఆ మాయ అంతటను నిండియున్నదే కావున నీశ్వరుఁడును సర్వగతుఁడును,సర్వాంతర్యామియునై యున్నవాడు "సర్వం ఖల్విదంబ్రహ్మ" అని

వేదమునను "సర్వం విష్ణుమయం జగత్" అని శాస్త్రమునను జెప్పఁబడియున్నది. మాయామయుఁడగు నీశ్వరుఁడు సర్వజగత్తున కధిష్ఠానమగుటవలన నీశుఁడు సర్వాత్మకుఁడు. "తదైక్షత; బహుస్యాం ప్రజాయేయేతి; సచ్చత్యచ్చాభవత్" అను శ్రుతులచేగూడ నీపై విషయమే తెలుపఁబడుచున్నది. కార్యమెప్పుడును కారణమునకన్న భిన్నమైనదిగాదని శాస్త్రము. అనుభవమున్ను. అదెట్లన? మట్టినుండి బుట్టినకుండ మట్టికన్న భిన్నముగాదు. అందుచే సర్వకారణమైన యీశ్వరునకంటే జగత్తు భిన్నమైనదికాదు. కాబట్టి యీశ్వరుడు సర్వాత్మకుఁడు. ఇట్లు ఈశ్వరుడు సర్వాత్మకుడైనను పూజ్య పూజకభావమనునది లోకసామాన్యమైనదగుటచే కొందఱు పూజ్యులును, కొందఱ పూజ్యులునుండిరి.

(3) ఇందు పూజ్యులగు అశ్వత్థాదులెవ్వరో వారీశ్వర శబ్దవాచ్యులు. ఎవరు పూజించెడువారో వారే జీవ శబ్దవాచ్యులని ప్రస్తుతము కల్పించుకొని వాడుకొందము. ఈపూజ్య పూజకభావమనునది గుణకర్మ భేదములతో నుండును.

(4) బ్రహ్మ, విష్ణు, రుద్ర, గణపతి, కుమారస్వామి మొదలగువారిలో నెవనినేని తమ కభీష్టమగు దైవమును పూజించు పూజకులుత్తములు. శరీరమునే పరమేశ్వరుడను బుద్ధితో పూజించువారలు మూఢులు.

(5) ఈపైఁ జెప్పఁబడిన భక్తిమఱల రెండు విధములు. 1 సగుణము, 2 నిర్గుణము అని, కృష్ణుఁడు మొదలగు

వారి మూర్తులను రాళ్ళమీదనున్న వానినిగాని, కాగితముల మీదనున్న వానినిగావి సేవించుట సగుణ భక్తియందురు. తన మనస్సులో గల్పించుకొనిన మూర్తులను సేవించుట నిర్గుణ భక్తియందురు. ఇందు మఱల సగుణభక్తి మూఁడు విధములు. 1 సాత్త్వికసగుణము 2 రాజస సగుణము, 3 తామస సగుణము. ఇందు ఫలమును గోరక చేయుసేవకు సాత్త్విక భక్తి యందురు. ఫలమునుగోరి చేయునది రాజసభక్తి యందురు. డంబముకొఱకు పటాటోపముతోఁ జేయునది తామసభక్తి యందురు. ఇఁక నిర్గుణభక్తి యను నదొక్కటే విధమే. ఈ నిర్గుణ భక్తియు దానుపాసించు దేవతామూర్తి భేదముచేఁ బెక్కు విధములు,

(6) ఈ నిర్గుణభక్తియే సమాధి యోగాంగములలోని ధ్యాన, ధారణములను వానిలో గలియును. అదియే క్రమముగ పరిణామమై ఆనంద పారవశ్యమును గలిగించును. దానినే నిర్వికల్ప సమాధియందురు. కావున భక్తిమార్గము గూడ క్రమముగ మోక్షప్రదమని భావము. పరిణామమును బొందకున్న నిర్గుణభక్తియు నా యాయి దేవతామూర్త్యను గ్రహముచే నీజన్మయందుగాని, జన్మాంతరమందుగాని, జ్ఞాన మార్గమును బట్టించుట కాధారమగును. కావున భక్తిమార్గము మోక్షము నిచ్చుటలో కొంత మోపయోగియని కానవచ్చుచున్నది. సాక్షాన్మోక్షసాధనము మాత్రము గాదనుటచే నద్వైత విరోధమేమియు గానరాదు.

(7) ఇందు సాత్త్విక భక్తిగలవారే యేదేవతల నుపాసించి ఫలమునుగోరక భజింతురో వారా యాలోకముల బొందుదురు. అదెట్లనగా? విష్ణుమూర్తిని ఫలాభిసంధిలేక సేవించునాతడు వైకుంఠ ధామమును దేహాంతమునఁ జెందును. శివునుపాసించువాడు కైలాసమును బొందును. బ్రహ్మను, సూర్యుని, చంద్రు నుపాసించు వారాయాలోకముల వరుసగాఁ బడయగలరు. కాని వీరు మఱల పుణ్యాంతమున తిరిగి జన్మల నందుదురు. అందులకే "ఆబ్రహ్మ భువనా ల్లోకాఃపునరావర్తినోర్జున!" అని గీతావచనము గలదు. ఈ పై శ్లోకమున 'ఆ బ్రహ్మ భువనాత్' అనుచోట నర్థము బ్రహ్మలోకము వఱకనిగదా? అట్లనినపుడు బ్రహ్మలోకమును (సత్యలోకమును) గూడ పొందుదురనియు, దానిని పొందిన వారు మఱలరారు. అని శాస్త్రముగదా? అనియు ప్రశ్నింపరాదు. ఇచ్చట బ్రహ్మలోకమువఱకు ననునపుడు బ్రహ్మలోకమునుగూడ యని యర్థమును చేయరాదు. అందుచే బ్రహ్మలోకమగు సత్యలోకముకాక ఇతర లోకములు పొందినవారు మఱల తిరిగి జన్మకు వత్తురని భావము.

(8) అనగా వైకుంఠాది లోకముల బొందిన సాత్త్విక భక్తిపరులు తమ సుకృతవిశేషముచే నాయాయిలోకములందు సత్సంగతిచే జ్ఞానవంతులయినచో వారియందలి యవిద్య నశించి శరీర త్యాగానంతరము మోక్షమును బొందుదురు. కావున జ్ఞాన ప్రాదుర్భావము లేనిది అవిద్యా నాశనముగాదు. అవిద్య నశింపనంతకాలము ఎచ్చటనున్నను

ముక్తి రాదనుట స్పష్టము. వేయేల? బ్రహ్మలోకమును బొందిన జీవులుగూడ నాచతుర్ముఖో పదిష్ట మహావాక్యార్థముచే జ్ఞానులగుచునే బ్రహ్మైక్యస్థితిని బొంది మోక్షమును బడయుదురు. "బ్రహ్మణాసహ తేస ర్వే" అని శాస్త్రము గలదు.

(9) అందుచే సర్వులు విజ్ఞాన సముపార్జనమునకుఁ బ్రయత్నింపవలయునుగాని యుపేక్ష వహింపరాదు. ఈ విషయమును గూర్చియే భాగవతమునఁ బ్రహ్లాదుని వచనము గలదు.

శ్లో॥ "లబ్ధ్వాసుదుర్లభమిదం బహుసంభవాంతే"

ఇది భక్తిని నిరూపించునట్టిదగు పదునాల్గవ పరిచ్ఛేదము.

( పదునాల్గవ పరిచ్ఛేదము సంపూర్ణము. )

## పదునైదవపరిచ్ఛేదము

(1) దృశ్యరూపమగు నీజగత్తు జీవసృష్టమనియు, ఈశ్వర సృష్టమనియు రెండువిధములు. ఈ కానవచ్చెడి ఘట, పటాది సమస్త వస్తుజాలము ఈశ్వరసృష్టమందురు. 'ఇది నేను, ఇదినాది' అను శరీరాభిమానముగల అహంకార మమకారరూపమై భోగ్యమగు నదంతయు జీవసృష్టియని యందురు. ఇందీశ్వరసృష్టమంతయు బంధహేతువుకాదు. అదెట్లనగా? అద్వైతమున్నప్పటికి సుషుప్త్యాదు లందధ్యాస

లేమి బంధములేదు. అట్లే జాగ్రదవస్థయందునను పశు వికారియమునకుఁ బూర్వమున్న తగులమి పశువికారియానంత రము బంధములేదు.

(2) ఇఁక జీవసృష్టిరూపమగు ద్వైతము జ్ఞానోదయ మున (నేనిదిగాదు; ఇదినాదిగాదు అనెడి) నివృత్తమగును గాని ఈశ్వరసృష్టి ద్వైతము నివృత్తికాదు. సుషుప్తి, మృతి, మూర్ఛాదులలో ద్వైతముగానరానిదైనను ద్వైతముండియే యున్నది. అదెట్లనగా? నిద్రించునప్పుడు ఆ పురుషుని దేహము నశింపలేదుగదా? కాగా యిట్టియీశ్వరసృష్టద్వైతముండియే యుండ బ్రహ్మమద్వైత మనుటెట్లు సరిపోవునని తలంపరాదు. చూడుడు!

(3) ఈ ద్వైతమనునది వ్యావహారికముగాని పార మార్థికముగాదని యిదివరలోనే నిర్ణయించుకొంటిమి. కావున వ్యావహారికమగు ఘటము వ్యావహారికపటముతో సద్వితీయముగాని, ప్రాతిభాసికమగు మరీచికోదకముతో గాని, రజ్జుసర్పముతోగాని, సద్వితీయముగాదు. అట్లే పార మార్థికమగు వస్తువు పరమార్థవస్తువుతో సద్వితీయమగుట తగును; కాని వ్యావహారికముతోగాని, ప్రాతిభాసికముతో గాని కాదు. ఆకాశమెన్నడు గంధర్వనగరముతో సాకారము కాదు. పారమార్థికమైనవస్తువు బ్రహ్మకంటే మఱియొకటి లేదు. కావున బ్రహ్మమున కద్వైతము సిద్ధమే యగును. ఇఁక బ్రహ్మమం దధ్యస్తమైన జగత్తుచే బ్రహ్మముగూడ ద్వైతము కాఁగూడదా యనిన నట్లుకాదు. ఏది దేనియం

దధ్యస్తమగునో దానిగుణములుగాని, దోషములుగాని యా యాధారమున కంటవు. ఆకసమున మనచే నారోపింపఁబడిన నీలిమ యాయాకాశమునంటుటలేదు. రజ్జువుపై నారోపించిన సర్పముయొక్క విషము ఆ రజ్జువు నంటదు. అట్లే బ్రహ్మమందధ్యస్తమైన ద్వైతములోని గుణదోషములు బ్రహ్మము నంటవు. ఇఁక యీబ్రహ్మకు జగత్తుతో ద్వితీయత్వము లేకపోవుగాక! మాయతో నుండరాదాయన నదియుఁబొసగదు. ఆ మాయయును బ్రహ్మయందే అధ్యస్తమైనది.

(4) ద్వైతమనగా భేదము. అది మూఁడు విధములు. 1 సజాతీయము 2 విజాతీయము 3 స్వగతము. అని. ఇందు 1 సజాతీయభేదమనగా నొక వృక్షము మఱియొక వృక్షమునకన్న భిన్నమనుట. 2 విజాతీయ భేదమనగా వృక్షము కుండకన్న భిన్నమనుట. 3 స్వగతభేదమనగా పత్రపుష్పాదులకంటె వృక్షము భిన్నమైనదనుట. ఈపైఁ జూపబడిన మూఁడు విధములగు భేదము బ్రహ్మమునకు లేదు. చైతన్యమొక్కటే యగుటచే సజాతీయభేదము లేదు. అసలు జగత్తు మిథ్యాస్వరూపము గావున జగత్తువలనఁ జెప్పఁదగిన విజాతీయభేదము లేదు. అవయవరాహిత్యమగుటవల్లను,సంపూర్ణమై ఏకస్వరూపమగుటచే స్వగతభేదమును లేకపోవుటచే బ్రహ్మమున కద్వైతము సిద్ధించుచున్నది. ఇఁక చేతన స్వరూపములగు జీవేశ్వరులతో గూడ బ్రహ్మమునకు సజాతీయభేదమును జెప్పగూడదా? యననదియు వలనుపడదు. అదేమనగా? బ్రహ్మచైతన్యమే

జీవేశ్వరచైతన్యమని శాస్త్రముగదా! అందులకే జీవేశ్వరులు ధర్మరహితమైన పరమానందస్వరూపమే యని శాస్త్రనిర్ణయము. ఏలనన? అంతఃకరణ ప్రతిబింబరూపము జీవుడనియు, మాయా ప్రతిబింబరూపము ఈశ్వరుడనియు, వ్యావహారికముగ పెద్దలు కల్పించిన రూపములు. కాని పరమార్థముగ విచారించిన మాయాంతఃకరణము లనెడి యుపాధులు రెండును లేనివే. అందుచే బ్రహ్మమునకంటె వేఱగునదంతయు నపరమార్థమే యని భావము. వ్యవహారకాలమున బ్రహ్మమును ద్వైతభావముగఁ దెలిసికొనుటయు భ్రమమూలకమే కాని యథార్థజ్ఞానము (ప్రమ) గాదు. అందుచే వ్యావహారికమంతయు భ్రాంతి సిద్ధము.

(5) భ్రాంతియనగా అధ్యాస. ఈ అధ్యాస (అదికాని దానియందాబుద్ధిగలుగుట) ఇదివఱకే చూపఁబడినది. కాలత్రయమందును రజ్జువు రజ్జువే; మరుభూమి మరుభూమియే; ఆకసమాకాశమే; అద్వైతరూపబ్రహ్మము బ్రహ్మమే. ఈ కాలత్రయమనుటలో త్రాడునుజూచి తాను సర్పమును సృష్టించుకాలము, ఆసర్పమునుండి భీతిఁబొందుకాలము. ఆ సర్పభ్రాంతి తొలగిన కాలమునని భావము. ఈ విషయమునుగూర్చియే శ్రీ శంకరాచార్యులవారు గీతాభాష్యములో 'నాసతే విద్యతేభావో నాభావో విద్యతే సతః' అను శ్లోకముక్రింద సత్తు సత్స్వరూపముగనే యుండును? అసత్ అసత్స్వరూపముగనే యుండుననియు చెప్పిరి. అసద్రూపముగు జగత్తు సద్రూపముగాదు. కాలమనుదానిని నిర్వచించుచు పెద్దలుదీని నవిద్యా

శక్తియే' అని చెప్పిరి; కాని అదియొక ద్రవ్యముగాదు. అందులకే "కలనాత్మికాశక్తిః కాలః" అని సిద్ధాంతితమైనది.

(6) అట్లయినచో అవిద్యయనునది పరమార్థములో లేనిదిగదా? అప్పుడీకాలమనుదాని గతియేమి? అనరాదు. ఏకాలమున రజ్జువుయందు సర్పమును గల్పించితిమో ఆకాల శక్తినే 'అవిద్య' యనియు, మాయయనియు నామాంతరములచే వాడుచుండిరి. కాని మఱియొకటి అవిద్యయనునది లేదు. ఇంక నీ అవిద్యా మాయాస్వరూపములలో శుద్ధసత్త్వస్వరూపము మాయయనియు, మలినసత్త్వస్వరూప మవిద్యయనియుఁ గొంద ఱవాంతర భేదమును జెప్పిరి. కాని యీ భేదము వైవక్షికము. (చెప్పదలచినచో చెప్పనగును) కాబట్టి యీయవిద్యాకాలికమైన సర్వప్రపంచము (ద్వైతము) పరమార్థమున లేనిదగుటచే వ్యావహారికద్వైతము పారమార్థిక బ్రహ్మమునకెట్లు భేదమును గల్పించును? నిజముగ కల్పింపలేదు. బ్రహ్మమద్వితీయము.

(7) అందుచేతనే బ్రహ్మవేత్తకభయస్థితిని 'అభయం వై జనక; ప్రాప్తోసి' అని శాస్త్రములుచెప్పుచున్నవి. 'ద్వితీయాద్వై భయం భవతి' అను వాక్యముచే ద్వైతజ్ఞానవంతునకు భయము ప్రతిపాదింపబడెను. కావున నానంద కాంక్షులగు వారెల్లరును ద్వైతభావమునువీడి అద్వైతత్వమునకై ప్రయత్నించుట ఉత్తమోత్తమమని భావము.

ఇది అద్వైతసిద్ధిని నిరూపించునట్టిదగు పదునైదవ పరిచ్ఛేదము

వేదాన్త సంగ్రహమను గ్రంథమునకు లంకా సీతారామశాస్త్రిగారి ఆంధ్రానువాదము సమాప్తము.

[illegible] సం॥ ఆషాఢ శుద్ధ ౨